Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*




సంపుటి: 82 • సంచిక: 10 • 11-3-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




# ఓటుకు లక్ష ఇచ్చినా తీరని ఆకలి!

## శాసనమండలి ఎన్నికలలో ద్రవమై పారుతున్న ద్రవ్యం!

- కాంగ్రెస్‌లో అనూహిత ఐక్యత.
- వాకాటి నక్కతోక తొక్కినట్లున్నాడు.
- సెంచరీ దాటని జగన్ శిబిరం.
- చాపక్రింద నీరు వలె తెలుగుదేశం.

స్థానిక సంస్థల నియోజకవర్గం శాసనమండలి ఎన్నికలు బహు రంజుగా నడుస్తున్నాయి. గత వారం చెప్పినట్లే, కాంగ్రెస్, జగన్ అభ్యర్థులు పోటీలు పడి ఓటర్లకు డబ్బు పందారం చేశారు. ఓటుకు 50వేలతో మొదలైన బేరం, పోటీ వల్ల లక్షకు ఎగబ్రాకింది. దాదాపు సగం మంది ఓటర్లు ఇద్దరి దగ్గరా తీసుకొన్నారు. ఇద్దరికీ ప్రమాణాలు చేశారు. తెలుగుదేశం అభ్యర్థి బీద రవిచంద్ర మొదట మొదట బీద అరుపులతో ప్రచారం ప్రారంభించాడు. కాంగ్రెస్, జగన్ అభ్యర్థులిద్దరూ బంగారు పిచుకలు, వారితో నేను పోటీ పడలేనని జాలిగొల్పే మాటలు మాట్లాడి, ఓటుకు పాతిక వేలు చేతిలో పెట్టాడు. అయితే, పరిస్థితి కొంత మెరుగ్గా కనపడడంతో ఆయన కూడా ఓటు రేటు పెంచుకొంటూ పోతున్నాడు.

కాంగ్రెస్ వాకాటి నారాయణరెడ్డి, జగన్ రామిరెడ్డి ప్రతాప్‌రెడ్డిలిద్దరూ మద్రాసు, బెంగళూరు, హైదరాబాద్‌లలో క్యాంప్‌లు నడుపుతున్నారు. దొరికిన ఓటరును దొరికిన ప్రక్క క్షణం కారో, బస్సో ఎక్కించి తరలించి వేస్తున్నారు. ఇద్దరి క్యాంపులలో దాదాపు మూడు వందల మంది ఓటర్లు చేరి వున్నట్లు అంచనా. తెలుగుదేశం మాత్రం క్యాంపుల జోలికి వెళ్లడం లేదు. క్యాంప్‌లలో ఓటర్లకు రాజ వైభోగాలు అందుతున్నాయి. త్రాగినంత మందు, తిన్నంత తిండి, ఎయిర్‌కండిషన్ చల్లదనం కల్గిన గదులలో బస, కోరిక కల్గితే షిర్డి వంటి చోట్లకు తీర్థయాత్రలు, కొత్త వస్త్రాలు, వైద్య పరీక్షలు... సకలం అభ్యర్థుల ఖర్చుతో జరిగిపోతు

కొరవ 14వ పేజీలో





# భూరాక్షసులు

శ్రీకాకుళం జిల్లా కాకరాపల్లి జాలర్లు, ఈస్ట్ కోస్ట్ థర్మల్ స్టేషన్ నిర్మాణంపై చేస్తున్న పోరాటం, ప్రైవేటు కంపెనీల భూదాహంపై యావత్ దేశం మనసు పెట్టి ఆలోచన చేయవలసిన అవసరాన్ని నొక్కి చెప్తున్నది. ఈ పోరాటంలో ఇద్దరు అమాయక పేదలు పోలీసు బుల్లెట్లకు బలైపోయారు. కాకరాపల్లిలో తంపర అనే రకం భూములున్నాయి. అవి చిత్తడి నేలలు. అక్కడ పుట్టే జలధారలు ఆ ప్రాంతం మాగాణులకు జీవధారలు. మరొకప్రక్క ఆ చిత్తడి నేలల్లో చేపలు పట్టుకొని బ్రతికే జాలర్ల కుటుంబాలు కూడా వందల సంఖ్యలో వున్నాయి. వైఎస్ ప్రభుత్వ హయాంలో ఈ భూములను థర్మల్ స్టేషన్ నిర్మాణానికి అప్పచెప్పారు. అయితే ఆ కంపెనీ యాజమాన్యం ఆ భూములకు సరైన ధర నిర్ణయించలేదు. వైఎస్ దగ్గర తమకున్న పలుకుబడితో, కూటినీళ్ల ధరకు కొట్టేయాలని చూసింది. దానిపై స్థానికులు అభ్యంతరం చెప్పారు. ప్రభుత్వం ఇచ్చిన పరిహారం మొత్తాన్ని తీసుకోవడానికి నిరాకరించారు. అయినా సరే ప్రభుత్వం వారి వద్ద నుంచి భూములను బలవంతంగా పెరుక్కొని, థర్మల్ స్టేషన్ నిర్మాణానికి అనుమతి ఇచ్చేసింది. తమను ఏ మాత్రం పట్టించుకోకుండా ఫ్యాక్టరీ నిర్మాణం జరిగిపోతుండడంతో కడుపు మండిన నిరుపేద జీవులు దానికి అడ్డం వెళ్లారు. వారికి నచ్చచెప్పి, వారి సమస్యలు తీర్చవలసిన ఫ్యాక్టరీ యాజమాన్యం ప్రభుత్వం తమ చేతిలో వుందన్న అహంకారంతో పోలీసు బలగాలను ఆ అమాయక జనంపైకి వుసికొల్పింది. పోలీసులు సంయమనం కోల్పోయి, ఫ్యాక్టరీ యజమానుల మెప్పుకోసం బుల్లెట్ల వర్షం కురిపించారు. దానితో ఈ సమస్యకు దేశవ్యాప్త ప్రాధాన్యత వచ్చింది. కేంద్ర పర్యావరణ మంత్రి జైరాం రమేష్ ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా ఫ్యాక్టరీ నిర్మాణం నిలిపివేస్తూ ఉత్తర్వులు ఇచ్చారు.

రాష్ట్రంలో కొత్తగా పుట్టుకొచ్చిన నూతన తరం భూరాక్షస గణానికి ప్రతినిధులు ఈ ఈస్ట్ కోస్ట్ థర్మల్ స్టేషన్ యజమానులు. పారిశ్రామిక అభివృద్ధి పేరిట వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తన ఐదున్నరేళ్ల పదవీ కాలంలో కొన్ని లక్షల ఎకరాలను ఇటువంటి వ్యాపారులకు దఖలు పరచారు. థర్మల్ స్టేషన్లు, ఎస్ఇజడ్‌లు, ఓడరేవులు, విమానాశ్రయాలు, పారిశ్రామిక వాటికల పేరిట ఒక్కొక్కరికి పది నుంచి పాతికవేల ఎకరాల వరకు సమర్పించాడాయన. దానితో వీరంతా నయా జమీందారుల వలె తయారయ్యారు. పేద రైతుల నోళ్లు కొట్టి స్వాధీనం చేసుకొన్న భూములలో వీరు పెట్టిన పరిశ్రమలు చాలా కొద్ది. మన జిల్లాలోని కృష్ణపట్నం ఓడరేవునే తీసుకొంటే, ఓడరేవు పేరిట, ఎస్ఇజడ్ పేరిట, థర్మల్ స్టేషన్ నిర్మాణం పేరిట దాదాపు 25 వేల ఎకరాలు ఇచ్చారు. కానీ అందులో వాడకంలో వున్నది వెయ్యి ఎకరాలు లోపు మాత్రమే. ప్రకాశం జిల్లాలో వాన్‌పిక్ ఎస్ఇజడ్‌కు 26వేల ఎకరాలు ఇచ్చారు. కానీ అక్కడ ఒక్క చిన్న తరహా పరిశ్రమ కూడా నెలకొనలేదు. పరిశ్రమల అభివృద్ధికి భూములు ఇవ్వవలసిన అవసరం ఎంతైనా వుంది. భూమి అనేది లేకుండా పరిశ్రమ పెట్టలేరు. అయితే ఆ పేరుతో అవసరానికి మించి ఇచ్చి, కొత్త తరం జమీందారులను సృష్టించే విష ప్రయత్నం వల్లనే ఈ భూకేటాయింపుల పట్ల ప్రజలలో తీవ్ర ప్రతిఘటన ఎదురౌతున్నది. ఎక్కడైనా ఒక పరిశ్రమ పెడితే, దాని చుట్టుప్రక్కల ప్రాంతాలలో భూముల ధరలు అమాంతం పెరిగిపోవడం ఆనవాయితీ అయ్యింది. కానీ ఆయా ప్రాంతాలలో వున్న మొత్తం భూమిని ఒకే సంస్థకు కేటాయించే దుష్ట బుద్ధి వల్ల ధరల పెరుగుదల ప్రయోజనం రైతులకు ఏ మాత్రం దక్కడం లేదు. పారిశ్రామికులు మాత్రం భూరాక్షసుల వలె మారిపోయి, వేలు లక్షల కోట్ల ఆస్తులు కూడ గట్టుకొంటున్నారు.

జమీన్‌రైతు

కాకరాపల్లి దుర్ఘటనతో అయినా రాష్ట్ర ప్రభుత్వం తన భూ కేటాయింపుల విధానంపై సమీక్ష జరపడం అవసరం. ఏ ఏ పరిశ్రమలకు ఎంత మేర భూమి అవసరమో అంతవరకు మాత్రమే వుంచి, తతిమా భూమిని తిరిగి స్వాధీనం చేసుకోవడం తక్షణం జరగవలసిన పని. థర్మల్ స్టేషన్ల నిర్మాణం వల్ల రాష్ట్రానికి జరుగుతున్నది ప్రయోజనమా, అనర్థమా అన్న పరిశీలన కూడా జరపవలసి వుంది. ప్రకృతి సహజ వనరులైన చిత్తడి భూములలో కూడా థర్మల్ విషం చిలకరించడం, పేద రైతుల నోరు కొట్టడం స్థానిక జాలర్ల జీవనోపాధి దెబ్బ తీయడం క్షమించరాని నేరాలు. అటువంటి పొరపాట్లను సరిదిద్దుకోవడం ప్రభుత్వ బాధ్యత.

## జనవాణి

### అరుదైన పుస్తకాలను భద్రపరచాలి!

నేడు పుస్తక ప్రియులు పలచబడ్డారు. పబ్లిక్ గ్రంథాలయాలు కుంటి నడకన పడ్డాయి. అరుదైన గ్రంథాల పునర్ ముద్రణ గగనమైంది. ఈ దయనీయ పరిస్థితుల్లో కొన్ని పాత రెఫరెన్సు పుస్తకాల వునికి ఎండమావిగా మారింది. రెండు దశాబ్దాల క్రితం నెల్లూరు కలెక్టరేట్‌లో జరిగిన ఓ వెతుకులాట కథను ఇందుకు చక్కని ఉదాహరణగా చెప్పవచ్చు. 1990 నాటికే జిల్లాలో 'బాస్వెల్ మాన్యువల్' ఓ అపురూప జ్ఞాపకంగా మిగిలిపోయింది. అవసరమైన సమాచారం కోసం కలెక్టర్ గారికి 'బాస్వెల్ మాన్యువల్' అవసరం కాగా అది నెల్లూరులో దొరకక పెద్ద దేవులాట మొదలై చివరకు బుచ్చిరెడ్డిపాళెం నుండి స్వర్గీయ దొడ్ల ముద్దుకృష్ణారెడ్డి పర్సనల్ లైబ్రరీ నుండి అరువు తెచ్చుకోవలసి వచ్చింది. ఇలాంటి దుస్థితే మరి కొన్నాళ్లకు స్వర్గీయ నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి ప్రచురించిన సింహపురి మండల సర్వస్వం పుస్తకానికి ఎదురుకావచ్చు. పైన పేర్కొన్న రెండు పుస్తకాల పునర్ముద్రణకు జిల్లా మేధావులు, చరిత్రకారులు, సాహితీ వేత్తలు, వదాన్యులు పూనుకోవాల్సి వుంది.

*ఎం.రామ్మూర్తి* — *విశాఖపట్నం*

### జగన్ ఫీజు పోరు దీక్ష విజయవంతం!

విద్యార్థుల ఫీజు రీఎంబర్స్‌మెంట్ జాప్యానికి నిరసనగా వైఎస్.జగన్మోహన్ రెడ్డి వారం రోజుల పాటు చేసిన నిరాహార దీక్ష విజయవంతమయ్యింది. జగన్ దీక్షకు లక్షలాది మంది విద్యార్థులు తరలివచ్చి సంఘీభావం ప్రకటించి ఆయన వెంట తామున్నామని చాటి చెప్పారు. ఈ దీక్షతోనైనా ప్రభుత్వం కళ్లు తెరచి విద్యార్థులకు రావాల్సిన ఫీజు బకాయిలు సత్వరమే చెల్లించాలని కోరుతున్నాను.

*బి.శాలి* — కావలి

### దురాక్రమణకు గురైన వీధి

అల్లూరు గ్రామ పంచాయితీ ఒకటవ వార్డు పరిధిలోని యాదవవీధి పంచాయితీ బావి వద్ద నుండి ప్రారంభమై తిరిగి జానీసాహెబ్ ఇంటి వద్ద మెయిన్ రోడ్డులో కలుస్తుంది. ఈ వీధిలోని కొందరు వ్యక్తులు రోడ్డును ఆక్రమించిపారేశారు. ప్రభుత్వం వేసిన సర్వే రాళ్లు పీకిపారేశారు. గతంలో విశాలంగా వున్న వీధి కాస్తా గొందిగా మారి రాకపోకలకు ఇబ్బందిగా మారింది. ఈ విషయాన్ని గత ఏడాది అల్లూరు తహశీల్దార్ దృష్టికి తీసుకవెళ్లగా ఆయన వెంటనే ఈ సమస్యను పరిష్కరించమని గ్రామ పంచాయితీ కార్యదర్శిని కోరారు. ఎన్నిసార్లు ఆయన్ను కలిసినా ఈ సమస్యను పంచాయితీ కార్యదర్శి పరిశీలించలేదు. పరిష్కరించిన పాపాన పోలేదు.

*పి.వి.రమణయ్య* — అల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**14-3-1941**
**పేజీలు : 14 వెల: అణా**

### వి.ఆర్.కాలేజి విద్యార్థి సంఘం

నెల్లూరు విద్యార్థి సంఘమునకు పర్వతరెడ్డి బాబులురెడ్డి గారు తిరిగి అధ్యక్షులుగా 24 ఓట్ల వ్యత్యాసముతో ఎన్నుకొనబడిరి.

### సత్యాగ్రహులు

బద్దెపూడి వెంకట నారాయణరెడ్డి, షణ్ముఖం గారు ఈ నెల 15వ తేదీన, వేమారెడ్డి శ్రీనివాసులు రెడ్డి 20వ తేదీన, కోవి బసవయ్య నాయుడు 31వ తేదీన సత్యాగ్రహం చేసెదరు.

### నెల్లూరు ముచ్చట్లు

మొన్న రేట్ పేయర్స్ మీటింగులో ఎప్పుడు జొల్లు మాటలు మాట్లాడని పి.వి.కృష్ణయ్య గారి వాక్యాలు పొరపాటేనండి.

***

ఆ మీటింగులోనే కమీషనర్ను విశ్వాసరాహిత్యంతో తీసివేయించే అధికారం వుందా లేదా అని విస్సా రాజగోపాలరావు, విశ్వనాథరావు గారలు వివాదపడ్డ విషయం సెక్షన్ 10 సి-4 క్లాజులో కౌన్సిలుకు అధికారం వున్నదండి.

***

ఖాజామొహిద్దీన్ కాంక్రీటు బల్లలను గూర్చి ఆ ఫోన్ చేస్తే సవ్యంగా రెండు మాటలు ఆన్సర్ చేయలేని అసమర్థతను మేము ఒప్పుకోమండి.

మీటింగు చేపల బజారు మాదిరిగా వుంది. ఒకరి తర్వాత ఒకరు మాట్లాడేది నేర్చుకోవలెనండి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**10-3-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### కృష్ణ రాయబారం

ఆంధ్ర శాసనసభ కాంగ్రెస్ పార్టీలోని విభేదాల పరిష్కారానికే కేంద్ర ఉపమంత్రి కృష్ణప్ప హైదరాబాదులో ఉభయ వర్గాలతో సంప్రదింపులు సాగిస్తున్నట్లు దినపత్రికల వార్తల వల్ల తెలుస్తున్నది. కృష్ణప్ప హైకమాండు తరపున వచ్చారో, లేక ఏ హోదాలో వచ్చారో తెలియదు. ఇప్పటి సూచనలను బట్టి వీరి రాయబారం గూడా కృష్ణరాయబారమే కాగలదేమోనని పరిశీలకులు భావిస్తున్నారు.

### ఏ.సి విశ్వరూపం

ఆంధ్ర శాసనసభ బడ్జెటు సమావేశంలో ప్రతిపక్ష పాత్రను యూనిటీ ఫ్రంటు వహించింది. మాజీ మంత్రి, ఫ్రంటు ప్రముఖ నాయకుడు ఏ.సి.సుబ్బారెడ్డి విశ్వరూపం దాల్చారు. పాలక పార్టీ సభ్యులు మంత్రులను వ్యక్తిగతంగా అవినీతిపరులుగా, ఆశ్రిత పక్షపాతులుగా, ముఠా పాలకులుగా చిత్రించి అపఖ్యాతి పాలుజేస్తే; ప్రతిపక్షీయులు మంత్రివర్గాన్ని రాజీనామా ఇచ్చి ఇంటికి పొమ్మని కోరారు. బడ్జెట్ సమావేశం బడ్జెట్ మీద చర్చలతోగాకుండా, మంత్రుల మీద వ్యక్తిగత విమర్శలతో నిండిపోయింది. మొత్తం మీద యాదవ కులంలో ముసలం పుట్టిందా అనిపించినవి గతవారపు సంఘటనలు.

రహస్య సమావేశంలో అయితే రక్తిగట్టవనుకొన్నట్లుంది ఫ్రంటు నాయకులు. మంత్రివర్గ ఉనికికి అస్థిరమైనదనే వాతావరణం కల్పిస్తే తప్ప పరిస్థితులు చక్కబడవనే నిర్ణయానికి వచ్చినట్లుంది. చావుకు పెడితేగానీ లంఖణానికి రాదని అభిప్రాయపడినట్లున్నది. కానీ ఈ వీరవిహారం, ఈ క్రమశిక్షణా రాహిత్యం సర్వ వినాశనకరమైనదనే పరమ సత్యాన్ని మంత్రివర్గం మీద యుద్ధం ప్రకటించిన ఫ్రంటు నాయకులలో ఒక్కరు గూడా గుర్తించక పోవడమే ఇందులో శోచనీయమైన విషయం.

# నెల్లూరు ముచ్చట్లు

## పిశ్చుకుడు

## సిఎంను కలసిన అఖిలపక్షం నేతలు

జిల్లాలో వరిపంటకు మద్దతు ధర ప్రకటించాలని కోరుతూ అఖిలపక్ష రైతు సంఘం నేతలు ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డిని హైదరాబాద్‌లో కలసి అభ్యర్థించారు. జిల్లాలో రైతులు ఎదుర్కొంటున్న ఇబ్బందులను జక్కా వెంకయ్య, మలిరెడ్డి రవీంద్రనాథ్‌రెడ్డి సిఎంకు వివరించారు. కానీ ఈ విషయమై ముఖ్యమంత్రి ఎటువంటి హామీ ఇవ్వక జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్‌లతో ఈ విషయమై మాట్లాడుతానన్నారు. ముఖ్యమంత్రిని కలసిన బృందంలో చంద్ర రాజగోపాల్, సిపిఎం ఎమ్మెల్యే జూలకంటి రంగారెడ్డి తదితరులున్నారు.

## కలక్టరేట్ గేటు మూస్తే ఎలా?

నెల్లూరు కలక్టరేట్ తూర్పు వైపు గేటుకు నిరంతరం తాళాలు వేసి వుంటున్నారు. దీనివల్ల కలక్టరేట్‌లో పని వున్న ప్రజలు దక్షిణం గేటు నుంచి కలక్టరేట్‌లోనికి పోవాల్సి వస్తుంది. 7వ తేది కలక్టరేట్ వద్ద అఖిలపక్షం నేతృత్వంలో వరికి గిట్టుబాటు ధర విషయమై ధర్నా జరుగగా అన్ని పార్టీల అగ్రనేతలు కలక్టరేట్‌లోనికి పోయే అవకాశం గేటు వేయడం వల్ల లేకుండా పోయింది. దక్షిణపు గేటు గుండా జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి వచ్చి ధర్నాకు మద్దతు తెలపాలంటే ఫోర్త్‌టౌన్ ఎస్ఐ తాళంతీసి ఈ నేతలిద్దరినీ బయటకు పంపి మళ్లీ గేటు వేశారు. ఆ తర్వాత వచ్చిన జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్, డిఆర్వో జయరామయ్య గూడా గేటు ఆవల నిలబడి అఖిలపక్ష నాయకులతో మాట్లాడడం చూసే వారికి విచిత్రమనిపించింది. గేటు మూసివేయాల్సినంత పరిస్థితులు నెల్లూరు కలక్టరేట్‌లో లేవనుకొంటాం.

## శాసన మండలి ఎన్నికల పరిశీలకుడు

శాసన మండలి ఎన్నికల్లో భాగంగా నెల్లూరు స్థానిక సంస్థల స్థానానికి జరుగనున్న ఎన్నికల పరిశీలకునిగా వ్యవసాయశాఖ కమిషనర్ సునీల్ శర్మను ప్రభుత్వం నియమించింది. సునీల్‌శర్మ నెల్లూరుకు పాతకాపే. గూడూరు సబ్ కలెక్టర్‌గా పనిచేశారాయన. ఎన్నికలయ్యే వరకు ఇక్కడే వుండి జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్‌కు సలహాలిస్తారు.

## వెంకటరమణారెడ్డి కలకలం

శాసన మండలికి నెల్లూరు స్థానిక సంస్థల స్థానం నుంచి జరుగనున్న ఎన్నికల నామినేషన్ చివరిరోజు వైఎస్ జగన్ వర్గీయుల శిబిరంలో ఇటీవల వరకు ప్రజారాజ్యం పార్టీలో వుండిన ఆనం వెంకటరమణారెడ్డి కనపడి కలకలం సృష్టించారు. తొలి నుంచి ఆనం బ్రదర్స్‌కు వ్యతిరేకంగా వ్యవహరిస్తున్న వెంకటరమణారెడ్డి ప్రవేశానికి జగన్ పార్టీ మినహా మరో పార్టీ లేకపోవడంతో ఆయన ఆ వైపు అడుగులు వేయక తప్పలేదు.

## సిపిఐ, సిపిఎం ఆఫీసులకు రామిరెడ్డి!

శాసన మండలి ఎన్నికలలో నెల్లూరు స్థానిక సంస్థల స్థానం నుంచి జగన్ వర్గం అభ్యర్థిగా పోటీ చేస్తున్న రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి 7వ తేది సిపిఎం, సిపిఐ ఆఫీసులను సందర్శించి ఆ పార్టీ ఎమ్పీటీసీల మద్దతు కోరారు. ఇరు పార్టీల నేతలు ఆయన్ను తమ పార్టీ కార్యాలయాలకు మర్యాదగా ఆహ్వానించి మాట్లాడినా ఈ విషయంలో రాష్ట్ర పార్టీ నిర్ణయమే తమ నిర్ణయమన్నారు. రాష్ట్ర పార్టీ నిర్ణయమంటే తెలుగుదేశం అభ్యర్థికి మద్దతు ఇవ్వడమేగా? కానీ జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి దూరపు ఆలోచనతో రామిరెడ్డి ప్రతాప్‌ను కమ్యూనిస్టు పార్టీల ఆఫీసులకు తీసుకెళ్లారు.

## కవిత్రయ జయంతులు

తిక్కవరపు రామిరెడ్డి కవిత్రయ జయంతి సంఘం యాజమాన్యాన కవిత్రయ జయంత్యుత్సవాలు మార్చి 11, 12, 13 తేదీల్లో టౌన్‌హాలులో జరుగుతాయి. 11వ తేది జరిగే నన్నయ జయంతి సభకు సీనియర్ న్యాయవాది పి.వి.రమణారెడ్డి అధ్యక్షత వహిస్తారు. డాక్టర్ లలితావాణి నన్నయ కవితా వైదుష్యంపై మాట్లాడతారు. 12వ తేది జరిగే తిక్కన జయంతి సభకు మాజీ ఎమ్మెల్యే జె.కె.రెడ్డి అధ్యక్షత వహిస్తారు. డాక్టర్ పి.వి.ఉమాశశి తిక్కన మహాకవి కవితా వైశిష్ట్యం గూర్చి మాట్లాడతారు. 13వ తేది జరిగే ఎర్రన జయంతి సభకు రత్నం విద్యా సంస్థల అధినేత కవిరత్నం అధ్యక్షత వహిస్తారు. డాక్టర్ గుమ్మన్నగారి బాలశ్రీనివాసమూర్తి ఎర్రన కవితా వైభవంపై ప్రసంగించి కవిత్రయ జయంతి సంఘం సన్మానాన్ని స్వీకరిస్తారు. సాహిత్య అభిమానులను ఈ సభలకు తరలి రమ్మంటున్నారు. కార్యక్రమ నిర్వాహకులు పి.వి.రమణారెడ్డి, బి.వి.నరసింహం.

## అర్బన్ బ్యాంక్ ప్రక్కన రోడ్డు!

నెల్లూరు గాంధీనగర్ దాని చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో సిమెంటు రోడ్లు వేసిన నేతలు ఇక్కడి అర్బన్ బ్యాంకును ఆనుకొని వున్న సందును మాత్రం వదిలేశారు. ఈ విషయమై తీవ్ర విమర్శ రేగడంతో ఈ వారంలో అర్బన్ బ్యాంకు ప్రక్క సందులో ఎట్టకేలకు సిమెంటు రోడ్డు వేశారు.

## పారిశుద్ధ్య కార్మికులకు పెరిగిన జీతం

మునిసిపాలిటీల్లో పనిచేసే కాంట్రాక్ట్ పారిశుద్ధ్య కార్మికులకు జీతం పెంచుతూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. గతంలో కాంట్రాక్ట్ పారిశుద్ధ్య కార్మికులకు నెలకు 3900 రూపాయలు జీతమిచ్చేవారు. కొత్త జి.ఓననుసరించి ఇక నుంచి 6700 రూపాయలు వీరికి జీతంగా ఇస్తారు. ఈ నిర్ణయం మూలంగా జిల్లావ్యాప్తంగా 1700 మంది పారిశుద్ధ్య కార్మికులకు మేలు చేకూరుతుంది.

## ఆర్‌జెడిగా పార్వతి

గుంటూరు స్కూల్ ఎడ్యుకేషన్ రీజినల్ జాయింట్ డైరక్టర్‌గా నెల్లూరు బియిడి కళాశాల ప్రిన్సిపల్ పి.పార్వతి నియమితులయ్యారు. పార్వతికి గతంలో గుంటూరు డిఇఓగా కూడా పనిచేసిన అనుభవముంది.

## కదలని 108 వాహనాలు!

ప్రాణరక్షిణులుగా పేరుగాంచిన 108 వాహనాలకు ప్రభుత్వం డీజిల్ బిల్లులు ఇవ్వను మీనమేషాలు లెక్కిస్తుండడం వల్ల జిల్లాలో తిరిగే 25 వాహనాలు నిలచిపోయాయి. 108 వాహనాలకు నెలసరి ఐదు లక్షల రూపాయలు డీజిల్ బిల్లులు ప్రభుత్వం చెల్లించాలి. ఈ విభాగంలో పనిచేసే 130 మంది ఉద్యోగులకు నెలసరి జీతంగా ఇవ్వాల్సిన ఎనిమిది లక్షల రూపాయలను 8వ తేదీకి కూడా ప్రభుత్వం చెల్లించక పోవడంతో విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.



జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ జొన్నవాడలో నిర్వహించే ప్రియదర్శిని వృద్ధుల ఆశ్రమం నాల్గవ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని కేక్ కట్ చేసి అక్కడి వృద్ధులకు తినిపిస్తున్న దృశ్యం.

## నిర్మలా ఏజెన్సీకి సరికొత్త హంగులు

నెల్లూరులో గృహోపకరణాల విక్రేతగా 30 ఏళ్ల అనుభవమున్న నిర్మలా ఏజెన్సీ అధినేత ఎస్.నరసింహారెడ్డి తన షోరూంకు సరికొత్త హంగులు అద్దారు. ఈ షోరూంను ఎస్‌బిఐ రీజనల్ మేనేజర్ కె. కామేశ్వరరావు ప్రారంభించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన ఎస్పీ దామోదర్ నాణ్యతా ప్రమాణాలకు గాను నిర్మల ఏజెన్సీకి వచ్చిన 1509001 – 2008 సర్టిఫికేట్‌ను నరసింహారెడ్డికి అందించారు. కొత్త షోరూం ప్రారంభోత్సవం సందర్భంగా ప్రతి కొనుగోలుపై ప్రత్యేక రాయితీ, స్క్రాచ్‌కార్డ్ ద్వారా క్యాష్ బ్యాక్ ఆఫర్ కూడ వుందని నరసింహారెడ్డి చెప్పారు.

కొరవ 14వ పేజీలో

# ముదిరిన ముజావర్లు

## కసుమూరు దర్గాలో ఆధ్యాత్మిక చింతనకు భగ్నం

మత సమైక్యతకు ప్రతీకగా నిలిచే కసుమూరు మస్తానయ్య దర్గాలో ముజావర్ల దాష్టీకాలు మరీ పెచ్చు పెరిగిపోయాయి. గతవారం జరిగిన గంథమహోత్సవంలో తమ పెత్తనానికి ఎదురు నిలచి 'ఫాతేహ' (ప్రార్థన) చేసిన విషయమై కడప పీఠాధిపతి ఆరీఫుల్లా హుస్సేనీపై దాడికి తెగబడ్డారు. దీన్ని ఆపను ప్రయత్నించిన మంచి పోలీసు అధికారి నెల్లూరు రూరల్ సిఐ జయరామసుబ్బారెడ్డి ముక్కు పగులగొట్టారు. ఈ విషయాలను చిత్రీకరిస్తుండిన, ఫోటోలు తీస్తుండిన విలేకరులను సైతం వాళ్ల వదల్లేదు. కసుమూరు దర్గాలో ఆధ్యాత్మిక వాతావరణం మటుమాయమైపోయిందనేందుకు ఈ ఘటనలు సాక్షీభూతాలు. వాస్తవానికి దర్గాలో ముజావర్ స్థానం చాలా చిన్నది. భక్తులు తీసుకవెళ్లే బూందీ, చక్కెర, బెల్లం, అన్నం చదివింపులు చేయడం వరకే పరిమితం కావాలి. కసుమూరు దర్గా ముజావర్లు దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. దర్గాలో కాలుపెట్టగానే హుండీలో కానుకలు వేయమంటారు. మస్తానయ్య సమాధి చుట్టూ తిరగకముందే ఈ దాష్టీకం మొదలవుతుంది. చదివింపుల సామాగ్రి బల్లపై పెట్టగానే ఫాతేహ చదవను డబ్బులడుగుతారు. ఇవ్వకుంటే శాపనార్థాలు పెడతారు. ఫాతేహాలో భాగంగా సమాధిపై చాదర్ సమర్పించాలంటే వంద రూపాయలకు తక్కువ కాకుండా ఇవ్వాలి. హిందువులకు శఠగోపం మాదిరి ముస్లింలకు మొహర్ చల్ తలమీద పెట్టను డబ్బులు డిమాండ్ చేస్తారు. మొత్తానికి సరిగ్గా చేయని ఫాతేహాకు ఐదు మంది ముజావర్ల చేతులు తడపాలంటే కసుమూరు దర్గాలో పరిస్థితి ఏ విధంగా వుందో అర్థం చేసుకోవచ్చు.

ముజావర్లలో నెల్లూరీయులు తక్కువ. కడప, ప్రొద్దుటూరు ప్రాంతీయులు బీరపీచు సంబంధాలతో చేరి ఎవరైనా భక్తులు ప్రతిఘటిస్తే వారిపై దాడులకు తెగబడుతున్నారు. చాలా మంది భక్తులు కుటుంబ సభ్యుల ముందు ఈ అవమానాన్ని తట్టుకోలేక పోలీసులకు ఫిర్యాదు చేయలేక ఊరుకొనే కొలది రెచ్చిపోతున్నారు. మామూలుగా ఏ దర్గాలో కానరానివిధంగా కసుమూరు దర్గాలో తెలుగు టీవీ సీరియల్స్‌లోని విలన్ల వంటి మహిళా ముజావర్లు కనపడతారు. ఇటీవల నెల్లూరు బాలాజీనగర్‌కు చెందిన 'అమ్ములు' అనే భక్తురాలు మస్తాన్‌వలికి బిర్యానీ నివేదించను ముజావర్లు డబ్బులు అడిగారు. ఎందుకని ప్రశ్నిస్తే ఆయన తీసుకొచ్చిన అన్నాన్ని విసిరికొట్టినట్లు బాధితుడు 'జమీన్‌రైతు'కు చెప్పారు. మతపెద్ద, పోలీసులు, భక్తులు, పాత్రికేయులు ఇలా అందరిపై దాడులు చేస్తూ పోతున్న కసుమూరు ముజావర్లను జిల్లా కలెక్టర్, ఎస్పీ ప్రత్యేక శ్రద్ధ తీసుకొని నియంత్రించే ఏర్పాటు చేయాలి. లేకుంటే నెల్లూరు ప్రతిష్ట రాష్ట్ర వ్యాప్తంగా మసకబారడం ఖాయం.



*ముజావర్ల దాడికి గురైన కడప పీఠాధిపతిని విచారిస్తున్న రూరల్ డిఎస్పీ రవికుమార్.*

# రసవత్తరంగా ఎమ్మెల్సీ ఎన్నికలు!







జిల్లాలో మారిన రాజకీయ సమీకరణ నేపథ్యంలో స్థానిక సంస్థల నియోజకవర్గ ఎమ్మెల్సీ ఎన్నికలు ఆసక్తికరంగా మారాయి. జిల్లాలో మారిన జడ్పీ రాజకీయాల కారణంగా కాంగ్రెస్ పార్టీ నిట్టనిలువునా చీలిపోయి జగన్ వర్గం, కాంగ్రెస్ పార్టీగా ఏర్పడడంతో ఈ దఫా ఎన్నికలు రంజుగా మారాయి. తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలతోపాటు జగన్ వర్గం నుంచి అభ్యర్థి రంగంలో వుండడంతో త్రిముఖ పోటీ నెలకొనింది. ఎవరికివారు తమ విజయావకాశాలపై ధీమాగా వున్నా వాస్తవ పరిస్థితులు మాత్రం ఎప్పటికప్పుడు మారుతున్నాయి. ప్రస్తుతం స్థానిక సంస్థల నియోజకవర్గానికి బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి ఎమ్మెల్సీగా వున్నారు, గత ఎన్నికల్లో కాంగ్రెస్ రెబల్ అభ్యర్థిగా పోటీ చేసిన ఆయన తెలుగుదేశం, వామపక్షాల మద్దతుతో గెలుపొందారు. ఆనాడు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసిన సివి.శేషారెడ్డి క్రాస్ ఓటింగ్‌తో ఓటమి పాలయ్యారు. ఈ పరిస్థితులలో నేడు ఎన్నికల బరిలో నిలబడిన అభ్యర్థులకు క్రాస్ ఓటింగ్ భయం వెన్నాడుతోంది. ఎవరికివారు జడ్పీటీసి, ఎమ్పీటీసిలను తమవైపు తిప్పుకొనేందుకు నానా తంటాలు పడుతున్నారు. ఇప్పటికే అభ్యర్థులందరూ క్యాంప్‌లు నిర్వహిస్తూ ఓటర్లను అన్నిరకాలుగా సంతృప్తిపరచడంలో తలమునకలై వున్నారు. కొందరు నగదు రూపంలో, మరికొందరు కాంట్రాక్ట్ పనుల రూపంలో ఓటర్లకు తాయిలాలు ఇచ్చి తమ గెలుపుకు బాటలు వేసుకొంటున్నారు. ఇక నగరపాలక, పురపాలక సంఘాలకు పాలక వర్గ గడువు ముగియడంతో ఈ ఎన్నికలలో వారికి ఓట్లు లేవు. కేవలం జడ్పీటీసి, ఎమ్పీటీసి సభ్యులు మాత్రమే ఓటు హక్కు వినియోగించుకొనే అవకాశం ఏర్పడింది. ప్రస్తుతం 46 మండలాల్లో 46 మంది జడ్పీటీసిలు, 599 మంది ఎమ్పీటీసి సభ్యులున్నారు. వీరిలో ఎవరు ఎవరిని గెలిపిస్తారో వేచి చూడాలి.

# ట్రాఫిక్ పోలీసులు చెడిపోయారు!

## గుర్తింపు కార్డుల పేరిట వసూళ్లు

ఆటో డ్రైవర్లకు గుర్తింపు కార్డులు మంజూరు, వాహనాలపై స్టిక్కర్లు వేసేందుకు పోలీసులు చేపడుతున్న చర్యలు ఆ శాఖ ప్రతిష్టను దిగజార్చేలా వుంటున్నాయి. నగరంలో తిరిగే ఆటోలన్నింటికీ యజమాని, డ్రైవర్ల వివరాలు నోటు చేసుకొని వారికి గుర్తింపు కార్డులు ఇచ్చేందుకు పోలీసులు చేపట్టిన కార్యక్రమం ప్రహసనంగా మారింది. ట్రాఫిక్ పోలీసులు ఆటోలను స్వంతదారుడు నడుపుతున్నట్లైతే 'ఓ' అనే స్టిక్కర్, అద్దెకు తిప్పుతున్నట్లైతే 'డి' అనే స్టిక్కర్ అంటించేందుకు, ఫోటో గుర్తింపు కార్డు మంజూరు చేసేందుకు ఒక్క ఆటో నుంచి 120 రూపాయలు ముక్కుపిండి వసూలు చేశారు. అంత మొత్తం పేదలకు భారమని ఆటో డ్రైవర్ల సంఘం విన్నవించుకొంటే పోలీసు ఉన్నతాధికారులు దానిని భరించలేనివారికి స్వచ్ఛంద సంస్థల సహకారంతో స్టిక్కర్లు, గుర్తింపు కార్డులు ఇస్తామని ప్రకటించారు. కానీ అది కార్యరూపం దాల్చలేదు. పోలీసులు రోడ్డుపైకి వచ్చిన ప్రతి ఆటో వద్ద ఆ మొత్తం వసూలు చేసి స్టిక్కర్లు అంటించి చేతులు దులుపుకొన్నారు తప్ప ఇంతవరకు గుర్తింపు కార్డులు ఇవ్వలేదట. మరోవైపు అంటించిన స్టిక్కర్లు పరమ నాసిరకంగా వుండడంతో అవి నాలుగు రోజులకే ఊడిపోయాయని అలాంటి దానికి తమ వద్ద నుంచి అంత మొత్తం కట్టించుకోవడం ఎందుకని ఆటో డ్రైవర్లు ప్రశ్నిస్తున్నారు. గతంలోనూ రెండు పర్యాయాలు గుర్తింపు కార్డులు, నెంబర్ వేసేందుకని ట్రాఫిక్ పోలీసులు హడావుడి చేశారు తప్ప సక్రమంగా అమలు చేయకలేకపోయారు. చివరకు ఆటో వారి విషయంలోనూ కక్కుర్తి పడడం విమర్శలకు తావిస్తోంది.



*ఆటో డ్రైవర్లంటే మరీ చిన్నచూపు.*

# మేధావులు మౌనం వీడాలి!

దేశాన్ని సంస్కరించాలన్నా, అవినీతి అక్రమాలను అరికట్టి అభివృద్ధి పథంలో నడపాలన్నా మేధావులు రాజకీయాలలో చురుకైన పాత్ర పోషించాలని బిజెపి సీనియర్ నాయకుడు ఎం.వెంకయ్యనాయుడు పిలుపునిచ్చారు. టౌన్‌హాల్‌లో 5వ తేది భారత రాజకీయాలు – మేధావుల పాత్ర అనే అంశంపై జరిగిన కార్యక్రమానికి ఆయన ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. సభకు హాజరైన పట్టభద్రులు, మేధావులనుద్దేశించి ఆయన ప్రసంగిస్తూ చట్టసభలకు విద్యావంతులు, మేధావులు అధిక సంఖ్యలో ఎన్నిక కావాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. దేశంలో ఎక్కడ చూసినా అవినీతి రాజ్యమేలుతుందన్నారు. కేంద్ర ప్రభుత్వం కుంభకోణాల మయం అయిందని, ఆంతరంగిక భద్రత కరువైందని, మావోయిస్టుల సమస్య, ధరల పెరుగుదల దేశాన్ని అస్తవ్యస్తం చేస్తున్నాయన్నారు. ఇంత జరుగుతున్నా ప్రభుత్వం చేతకానితనంతో వ్యవహరిస్తూ అవినీతి పరుల కొమ్ముకాస్తున్నాదని విమర్శించారు. రాజకీయాల్లో విలువలు పతనం అవుతున్నాయని ఆవేదన చెందారు. వీటన్నింటిని పరిష్కరించాలంటే విద్యావంతులు, మేధావులు చట్టసభలకు రావాలని పిలుపునిచ్చారు. బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు కిషన్‌రెడ్డి మాట్లాడుతూ బోఫోర్సు కుంభకోణం, 2జి స్పెక్ట్రం కుంభకోణం, కామన్‌వెల్త్ క్రీడల్లో భారీ అవినీతి జరిగిన తీరును ప్రస్తావించారు. స్వదేశీ జాగరణ మంచ్ జాతీయ అధ్యక్షుడు గురుమూర్తి తదితరులు ప్రసంగించారు. అనంతరం బిజెపి అండదండలతో శాసనమండలికి పట్టభద్రులు, ఉపాధ్యాయ నియోజకవర్గాల నుంచి పోటీ చేస్తున్న వెంకట సుబ్బారెడ్డి, సురేంద్రలను సభకు పరిచయం చేసి వారిని గెలిపించాలని కోరారు. ఈ కార్యక్రమంలో బిజెపి జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు ఆంజనేయరెడ్డి, రమేష్, సురేష్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.




*టౌన్‌హాలులో జరిగిన సదస్సులో మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.*

# వాకాటి గెలుపు జిల్లా అభివృద్ధికి మలుపు!

కేవలం స్వశక్తితో పైకివస్తారు కొందరు. వారి దగ్గర అదృ



సహకార బ్యాంక్ వార్షికోత్సవ సంబరాలలో ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డితో వాకాటి నారాయణరెడ్డి.

ష్టాన్ని గూర్చి మాట్లాడడం అనవసరం. శాసనమండలి నెల్లూరు స్థానిక సంస్థల



అవివా, ఇఫ్‌కో టోక్యో ఇన్సూరెన్స్ కంపెనీ ప్రతినిధులతో కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి, రాష్ట్ర మంత్రి రామనారాయణరెడ్డి సమక్షంలో ఒప్పందం చేసుకొంటున్న కేంద్ర సహకార బ్యాంక్ అధ్యక్షుడు వాకాటి నారాయణరెడ్డి.

స్థానం నుంచి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీ చేస్తున్న వాకాటి నారాయణరెడ్డి




బ్యాంక్ ఓపెన్ ఎయిర్ వేదిక ప్రారంభోత్సవంలో మంత్రి రామనారాయణతో వాకాటి.

తడ మండలం చేనిగుంట గ్రామంలోని మధ్యతరగతి వ్యవసాయ కుటుంబంలో పుట్టారు. చిన్ననాటి నుంచే వాకాటి నారాయణరెడ్డిలో ఆత్మవిశ్వాసం మెండు. తన చుట్టూవున్న సమాజానికి ఏదో ఒకటి చేయాలన్న తపనతో 'వివిఆర్' నిర్మాణ సంస్థను 1986లో నెలకొల్పారు. తడ, సూళ్లూరుపేట ప్రాంతీయులకు ఈ సంస్థలో వుద్యోగాలిచ్చారు. సమర్థులైన వారే ఎప్పుడూ నాయకత్వం వహిస్తారు. అందరికీ మార్గదర్శకులవుతారని పెద్దలు నుడివినట్లు భారతీయ రైల్వేలలో సిగ్నల్ వ్యవస్థ ఏర్పాటు పనుల్లో వివిఎన్ఆర్ నిర్మాణ సంస్థ దేశంలోనే నెంబర్‌వన్ కంపెనీగా ఎదిగింది. ప్రత్యక్షంగా 500 మందికి పరోక్షంగా 1500 మందికి ఉపాధినిస్తుంది. ఈ సంస్థ టర్నోవర్ 600 కోట్ల రూపాయలు. విదేశీ సంస్థలతో కూడా కలసి వివిఎన్ఆర్ సంస్థ పని చేస్తుంది.

## పాతికేళ్లుగా కాంగ్రెస్‌కు సైనికుడు

మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి ప్రియ శిష్యునిగా రాజకీయ అరంగేట్రం చేసిన వాకాటి నారాయణ రెడ్డి తొలినాళ్లలోనే తడ మండలపరిషత్ పీఠాన్ని కాంగ్రెస్‌కు కైవసం చేసిన నేతగా గుర్తింపు తెచ్చుకొన్నారు. 15ఏళ్ల క్రితం డిసిసి కోశాధికారిగా పార్టీ బాధ్యతలు చేపట్టారాయన. సూళ్లూరుపేట నియోజకవర్గంలో గత మూడు దఫాలుగా జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థుల విజయం కోసం ఆయన పడ్డ శ్రమను ఇప్పటికీ పార్టీ కార్యకర్తలు స్ఫూర్తిదాయకంగా చెప్పుకొంటూనే వుంటారు.

## సెంట్రల్ బ్యాంకు ప్రతిష్ట పెంచారు

ఒకరి గుణగణాలు పరీక్షించి చూడాలంటే అతనికి ఒకసారి అధికారం ఇచ్చి చూడమంటారు. వాకాటి నారాయణరెడ్డి 2005 సంవత్సరంలో కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు ఛైర్మన్‌గా బాధ్యతలు తీసుకొన్న రోజు బ్యాంకు దివాల తీసే పరిస్థితిలో వుండింది. వుద్యోగులకు జీతాలు ఇచ్చే పరిస్థితి లేదు. అటువంటి బ్యాంకును నష్టాల ఊబి నుంచి బయటకులాగి లాభాల బాట పట్టించి అందరి చేత శబాష్ అనిపించుకొన్నారు. ప్రధాని ప్రకటించిన వడ్డీమాఫీ, రుణమాఫీ పథకాలతో సెంట్రల్ బ్యాంకు రైతులకు చేదోడు వాదోడుగా నిలిచింది. డిసిసిబికి అనుబంధంగా వున్న అన్ని సహకార బ్యాంకుల శాఖల్లో ఆన్‌లైన్ సేవలు ప్రారంభించిన ఘనత, బ్యాంకు డిపాజిట్లు 100కోట్లకు చేర్చిన ఘనత, రైతులకు 20కోట్లకు పైగా రుణాలిచ్చిన ఘనతను వాకాటి నారాయణరెడ్డి సొంతం చేసుకొన్నారు.

## తానా సభలకు ప్రత్యేక ఆహ్వానితుడు

గత ఏడాది అమెరికాలోని చికాగో నగరం రోజ్‌మండ్ కన్వెన్షన్ సెంటర్‌లో మూడు రోజులపాటు జరిగిన తానా మహాసభలకు వాకాటి నారాయణరెడ్డి ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. జిల్లాలోని ఏ రాజకీయ నాయకుడికి ఇటువంటి అరుదైన గౌరవం దక్కలేదు. అప్పటి రాష్ట్ర మంత్రి మోపిదేవి వెంకటరమణ, రిజర్వ్ మాజీ గవర్నర్ వేణు




తానా సభలలో మంత్రి మోపిదేవి వెంకటరమణ, ఎమ్మెల్యే శ్రీనివాసరావులతో వాకాటి.

గోపాలరెడ్డితో కలిసి ఈ సభలలో ప్రవాసాంధ్రులను ఉత్తేజపరిచే ఉపన్యాసమిచ్చారాయన.

## సేవ చేయనే శాసనమండలికి...

మంచి హృదయం గల వ్యక్తి ఎంతో గొప్పవాడు. అటువంటి వ్యక్తి శాసనమండలి లాంటి పెద్దలసభలో వుంటే ఎన్నో ప్రజావసరాలు తీరుస్తాడు.




అమెరికాలో జరిగిన తానా సభలలో ప్రవాసాంధ్ర ప్రముఖులతో వాకాటి నారాయణరెడ్డి.

జిల్లాలోని తీరప్రాంత మండల ప్రజలు మంచినీటి సమస్యతో అల్లాడినప్పుడు వారికి అంతో ఇంతో చేయూతగా నిలిచారు నారాయణరెడ్డి. జిల్లాలోని చాలా ప్రాంతాల్లోని ప్రజలకు విద్య, వైద్యం సరిగ్గా అందడం లేదు. రైతు కూలీల సంక్షేమమే లక్ష్యంగా పని చేయాలంటే చట్టసభల్లో వుండాలన్నది నారాయణరెడ్డి ఆకాంక్ష. దీనికిగాను అందరినీ సహకరించమంటున్నారాయన.

## విజయానికి ఆత్మవిశ్వాసం ఊపిరి

కాంగ్రెస్ పార్టీ స్థానిక సంస్థల స్థానం నుంచి టిక్కెట్ ఇవ్వడం నా అదృష్టంగా భావిస్తున్నానంటున్నారు వాకాటి నారాయణరెడ్డి. ఆయన మాట్లాడుతూ నెల్లూరు జిల్లాలో కాంగ్రెస్ పార్టీకి ఎంతో బలముంది. ఎన్ని ఒడిదుడుకులొచ్చినా పార్టీ చెక్కు చెదరలేదు. ఇప్పటికీ కాంగ్రెస్ పార్టీనే ఏ సమస్యనైనా తీరుస్తుందని ప్రజల నమ్మకం. స్థానిక సంస్థల బలోపేతానికి కాంగ్రెస్ పార్టీ ఎంతో చేసింది. జడ్పీటీసి సభ్యులు, ఎమ్పీటీసీ సభ్యులకు ఇదంతా తెలుసు. జిల్లాలో కాంగ్రెస్ బాగోగులు చూసే నేదురుమల్లి జనార్ధన రెడ్డి, జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డి నా విజయం కోసం అహరహం శ్రమిస్తున్నారు. మాజీ మంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, కాంగ్రెస్ నేతలు పనబాక కృష్ణయ్య, పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డి, బూదాటి రాధయ్య, బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి, సివి.శేషారెడ్డి అండదండలతో శాసన మండలి సభ్యునిగా తప్పక గెలుస్తానన్న ఆత్మవిశ్వాసం వ్యక్తం చేశారు.



పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ నేతృత్వంలో దగదర్తి మండలం కట్టుబడిపాళెం ప్రాథమిక పాఠశాలలో పిల్లలకు ప్లేట్లు, గ్లాసులు పంపిణీ చేస్తున్న బీదరాల చెన్నయ్య. ప్రక్కన హెడ్మాస్టర్ మల్లికార్జునరెడ్డి, ఆచార్య ఆదిత్య తదితరులు.





బోగోలు మండలంలో 98శాతం మంది పిల్లలకు పోలియో చుక్కల మందు వేసి రికార్డు సృష్టించిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రం డాక్టర్ సౌజన్య, వారి సిబ్బంది.



శాసనమండలి పట్టభద్రుల స్థానం నుంచి పోటీ చేస్తున్న తెలుగుదేశం అభ్యర్థి దేశాయిశెట్టి హనుమంతరావుకు మద్దతు ప్రకటిస్తున్న ప్రోగ్రెసివ్ ముస్లిం అడ్వొకేట్స్ అసోసియేషన్ సభ్యులు నన్నేసాహెబ్, ఆజం హుస్సేన్, అబ్దుల్ ఖాదర్ తదితరులు.

# బిట్రగుంటపై శీత కన్ను!

## గతంలో ప్రకటించిన ఒక్క రైల్వే ప్రాజెక్టూ మంజూరు కాలేదు

భారతీయ రైల్వేకు దశాబ్దాలపాటు విశేష సేవలందించిన బిట్రగుంట గురించి ఏ ఒక్కరూ పట్టించుకోకపోవడం పట్ల స్థానికంగా తీవ్ర ఆగ్రహావేశాలు వ్యక్తం అవుతున్నాయి. బిట్రగుంట రైల్వేప్రాజెక్టు నిర్మాణానికి ఎప్పటిలాగే ఈసారి మొండి చేయి చూపించింది రైల్వే మంత్రి మమతాబెనర్జీ. గతంలో ఎన్నడూ లేని విధంగా భారీ బడ్జెట్ ఆమె ప్రవేశపెట్టినా బిట్రగుంట ఊసే లేకపోవడం పాలకులకు వున్న నిర్లక్ష్యాన్ని తెలియజెప్తుంది. 2004లో శంకుస్థాపన చేసిన కాంక్రీట్ స్లీపర్ తయారీ యూనిట్‌కైనా నిధులు సంగతి అంతే. రైల్వే మంత్రి మమత తీరును నిరసిస్తూ బోగోలులో బిజెపి ఆధ్వర్యంలో నిరసనగా భిక్షాటన చేశారు. జిల్లాకు చెందినవారు ముగ్గురు రాజ్యసభ సభ్యులుగా, ఐదు మంది పార్లమెంటు సభ్యులుగా వున్నా బిట్రగుంట రైల్వే ప్రాజెక్టుల గురించి పట్టించుకోకపోవడంతో ఎవరికి పట్టని అనాథలా మారింది బిట్రగుంట.

● శృతిమించిన

# మందుబాబుల ఆగడాలు

బోగోలు మండలంలో మందుబాబుల ఆగడాలకు అంతేలేకుండా పోతోంది. పగలు రాత్రి అనే తేడా లేకుండా తాగి తందనాలాడుతూ దారినపోయే వారిని అల్లరి చేస్తుండడంతో మహిళలు భయపడిపోతున్నారు. మండలంలోని సుందరగిరి వారి కండ్రిగలో పాఠశాలకు ఎదురుగా మద్యం బెల్టుషాపు వుండడంతో విద్యార్థులు, ఉపాధ్యాయులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. నిత్యం గొడవలు, రచ్చారావిళ్లతో చదువులకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోందని వాపోతున్నారు. ఇబ్రహీంపట్నం నుంచి బోగోలు బజార్‌కు రావాలన్నా మధ్యలో మద్యం బెల్టుషాపులు, మద్యం షాపులు వల్ల మహిళలు, పిల్లలు తిరగలేని పరిస్థితి ఏర్పడుతోందని స్థానికులు ఆవేదన చెందుతున్నారు. పోలీసులకు, ఎక్సైజ్ అధికారులకు మద్యం బెల్టుషాపుల గురించి తెలిసినా పట్టించుకోకపోవడం వల్లనే సమస్యలు తలెత్తుతున్నాయని ప్రజలు ఆగ్రహిస్తున్నారు. ఇప్పటికైనా ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని బెల్టుషాపులను తొలగించాలని వారు కోరుకొంటున్నారు.

### నిషాలో బోగోలు యువత

# పశుగ్రాసం కొరత తీరుస్తాం!

● ఫారెస్టు కన్సర్వేటర్ భాస్కర్‌రెడ్డి వెల్లడి

పశుగ్రాసం కొరత తీర్చేందుకు ప్రత్యేక ప్రణాళిక రూపొందిస్తున్నట్లు ఫారెస్టు కన్సర్వేటర్ భాస్కర్‌రెడ్డి తెలిపారు. దక్కిలి మండలంలోని బ్రాహ్మణపల్లెలో ప్లాంటేషన్‌ను పరిశీలించిన అనంతరం ఆయన మాట్లాడుతూ అటవీ భూముల్లో 600 హెక్టార్లలో మొక్కలను పెంచేందుకు చర్యలు చేపడుతున్నామన్నారు. జిల్లాలో ఇప్పటికే 300 హెక్టార్లలో మొక్కలు నాటామని చెప్పారు. ఇకపై జామాయిల్ మొక్కలు నాటడంతోపాటు ఫలసాయాన్ని అందించే మొక్కలను నాటనున్నట్లు వివరించారు. మొక్కలను సంరక్షించే బాధ్యత వనసంరక్షణ కమిటీలదేనని తెలిపారు. పశుగ్రాసం కొరత గురించి మాట్లాడుతూ గ్రాసం పెంపునకు 100 హెక్టార్ల భూమిని ఎంపిక చేశామన్నారు. ఎర్రచందనం అక్రమ రవాణాపై స్పందిస్తూ చాలావరకు సిబ్బంది సహకారంతో ఎర్రచందనం స్మగ్లింగ్‌ను అరికట్టగలిగామన్నారు. అటవీశాఖ గిడ్డంగులలో ఇప్పటివరకు వేయిటన్నుల ఎర్రచందనం నిల్వవున్నట్లు భాస్కర్‌రెడ్డి తెలిపారు.

# బైపాస్ రైడర్లు ఆత్మకూరు వెళ్లాలి

● ఆర్ఎం కొమరయ్య ఆదేశం

దూర ప్రాంతాలకు వెళ్లే బైపాస్‌రైడర్లు తప్పనిసరిగా ఆత్మకూరు ఆర్‌టిసి డిపోకు వెళ్లాలని ఆ సంస్థ ఆర్ఎం కొమరయ్య ఆయా డిపోల నిర్వాహకులకు, ఇతర జిల్లాల రీజినల్ మేనేజర్లకు సూచించారు. ఆత్మకూరు డిపోకు వివిధ బస్సులు వెళ్లని కారణంగా ప్రయాణీకులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారని దీనిని దృష్టిలో వుంచుకొని ఈ సూచన చేసినట్లు తెలిపారు. సంగంలో బస్‌స్టేషన్ ఏర్పాటుకు స్థల పరిశీలన జరిపామన్నారు. వింజమూరు బస్టాండులో రోడ్డు నిర్మాణానికి చర్యలు చేపడుతున్నట్లు చెప్పారు. ఆత్మకూరు డిపోలో మరమ్మత్తులకు గురయ్యే బస్సులకు అక్కడే రిపేర్లు చేసేందుకు వీలుగా చర్యలు తీసుకొంటున్నామన్నారు. ఆత్మకూరు పట్టణంలోకి ప్రతి రోజూ రాత్రి 12 గంటలకు బస్సు సర్వీసులను నడుపుతున్నట్లు తెలిపారు. సోమశిల బస్టాండు సెంటర్ నుంచి ఉదయం, సాయంత్రం వేళల్లో రెండు ట్రిప్పులను గురుకులం వద్దకు నడపాలని, వింజమూరు నుంచి ఆత్మకూరు మీదుగా నెల్లూరుకు బస్సును నడిపేందుకు చర్యలు తీసుకొంటున్నామన్నారు. ఇటీవల మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి రచ్చబండలో ప్రజలు తెలిపిన సమస్యలను పరిష్కరించే భాగంగా ఆయా చర్యలు చేపడుతున్నట్లు ఆర్టీసి అధికారులు తెలిపారు.

# వెంకటగిరికి మహర్దశ!

## జనాన్ని మునగ చెట్టు ఎక్కించిన చింతా

వెంకటగిరికి మహర్దశ పట్టిందని తిరుపతి ఎంపి చింతా మోహన్ వ్యాఖ్యానించారు. ఇటీవల పట్టణంలో జరిగిన కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ వెంకటగిరిని ఒకప్పుడు రాజులు ఏలారు. ఇప్పుడు ఈ ప్రాంతంలో వున్న ఆడవాళ్లందరూ మహారాణులు కాబోతున్నారంటూ చమత్కరించారు. దగ్గరలో మన్నవరంలో భెల్ పరిశ్రమ ఏర్పాటు కావడం మనకో వరం, దాని వలన భూముల రేట్లు పెరుగుతున్నాయని తెలిపారు. భవిష్యత్తులో వెంకటగిరిలో చోటు దొరకని స్థితి. ఎవరూ తొందరపడి స్థలాలు అమ్ముకోవద్దు, కొత్త ఢిల్లీ, పాత ఢిల్లీలాగా వెంకటగిరి ఎంతో అభివృద్ధి చెందనుందని ఆశాభావం వ్యక్తం చేశారు. విశాలమైన రోడ్లు రాబోతున్నాయి. ఇప్పటివరకు కుటుంబం అంతా ఒకే గదిలో సర్దుకొనే వారు. ఇకపై రెండు గదులు, వంటరూము ఉండేలా ఇళ్లు కట్టిస్తాం. పలు కొత్తరైళ్లు ఈ మార్గాన నడవబోతున్నాయని ప్రకటించడంతో ప్రజలు చింతా ప్రసంగానికి ఉబ్బితబ్బిబ్బయ్యారు.

● సాగుతున్న...

# సాగునీటి కాల్వ పనులు!

సాగునీటి కాల్వ పనులు ముందుకు సాగక రైతులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కోవాల్సిన పరిస్థితి బోగోలు మండలంలో ఎదురౌతోంది. ఎస్‌విపిఎం చానల్ పరిధిలో సాగునీటి కాల్వ పనులు 13లక్షల రూపాయలతో చేపట్టారు. పదేళ్ల క్రిందట ప్రారంభమైన పనులు ఏళ్లు గడిచిపోతున్నా పనులు ముందుకు సాగడం లేదు. పనులు చేపట్టిన కాంట్రాక్టర్ అర్థాంతరంగా పనులు నిలిపి వేసి వెళ్లడంతో రైతులకు కష్టాలు మొదలయ్యాయి. ఈ కాల్వ క్రింద బోగోలు, నాగులవరంలో 500 ఎకరాలకు నీరు అందుతుంది. ప్రజాప్రతినిధులు, అధికారులు ఈ కాల్వ పనుల గురించి పట్టించుకోకపోవడంతో రైతులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. తక్షణం కాల్వ పూడిక తీసి పనులు చేపట్టాలని, రైతాంగాన్ని ఆదుకోవాలని పలువురు రైతులు అధికారులను కోరుకొంటున్నారు.



నెల్లూరు హరి పిక్చర్స్ కార్యాలయంలో జూనియర్ ఎన్టీఆర్ నటించిన శక్తి చిత్రం ఆడియో క్యాసెట్లను విడుదల చేస్తున్న ఎన్టీఆర్ సేవాసమితి అధ్యక్షుడు ఎస్.రవిచంద్ర. ప్రక్కన సురేష్, మురళీమోహన్, రవీంద్రనాయుడు.

# మాటవినని బ్యాంకర్లు!

**● డిఆర్‌డిఏ పిడి ఆరోపణ**



రుణాల కేటాయింపులో బ్యాంకర్లు ప్రభుత్వ ఆదేశాలను పట్టించుకోవడం లేదని డిఆర్‌డిఏ ప్రాజెక్టు డైరెక్టర్ విజయచందర్ ఆరోపించారు. ఇటీవల గూడూరు డివిజన్‌లో బ్యాంకర్లు, వివిధ శాఖల అధికారులతో ఆయన సమీక్ష చేశారు. డిఆర్‌డిఏ ద్వారా 2010-11 ఆర్థిక సంవత్సరానికి జిల్లాలో 232 కోట్ల రుణాలను అందజేయాలన్న లక్ష్యంగా పెట్టుకొన్నామన్నారు. ఇప్పటివరకు 190కోట్ల పంపిణీ చేశామని, మిగతా 42కోట్ల రూపాయలను పంచేందుకు బ్యాంకర్లు ముందుకు రావాలన్నారు. బ్యాంకు లింకేజి ద్వారా 40 కోట్ల రుణాలు ఇవ్వాల్సి వుండగా కేవలం 24కోట్లు మాత్రమే వినియోగించుకొన్నామని తెలిపిన ఆయన రుణాలు కేటాయింపులో బ్యాంకర్ల తీరును తప్పుబట్టారు. ఈ మొత్తాన్ని పొదుపు గ్రూపులు, గృహ నిర్మాణం, ఎస్సీ, ఎస్టీల సంక్షేమానికి వినియోగిస్తున్నట్లు చెప్పారు. మైక్రోఫైనాన్స్‌ల నుంచి పేదలను రక్షించేందుకే పెద్దఎత్తున రుణాలు ఇవ్వాలని ప్రభుత్వం నిశ్చయించిందన్నారు. బ్యాంకు అధికారులు మాత్రం రికవరీలు లేకుండా రుణాలిమ్మంటే ఎలా అని ప్రశ్నిస్తున్నారు. ముఖ్యంగా తీర ప్రాంత గ్రామాల్లో, పొదుపు గ్రూపులు లక్షల్లో బకాయిలు వున్నారని నోటీసులకు కూడా వారు స్పందించడంలేదని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

# పుచ్చరైతులను దెబ్బతీసిన నకిలీ విత్తనాలు

**మర్రిపాడు రైతుల లబోదిబో**

భూమిని నమ్ముకొన్నవాడు ఎప్పటికీ చెడిపోడనేది పాత సామెత అయింది. ఇప్పుడు రైతు అన్ని రకాలుగా దగా పడుతున్నాడు. విత్తనాలు, మందులు అన్ని కల్తీవి కావడంతో రైతాంగానికి చివరకు నష్టాలే మిగులుతున్నాయి. ముఖ్యంగా జిల్లాలో పుచ్చసాగు చేస్తున్న రైతుల పరిస్థితి దయనీయంగా వుంది. పుచ్చిపోయిన, నకిలీ విత్తనాలు రైతులను కోలుకోలేని దెబ్బతీశాయి. మర్రిపాడు మండలం నెర్దనంపాడు గ్రామరైతులు ఈ నకిలీ విత్తనాల కారణంగా తీవ్రంగా నష్టపోయారు. కటారి వెంకటేశ్వర్లు అనే రైతు 10 ఎకరాల్లో పుచ్చసాగు చేపట్టాడు. హైదరాబాద్‌కు చెందిన సిమునిస్ కంపెనీ నుంచి పుచ్చ విత్తనాలు కొనుగోలు చేశాడు. 38వేల రూపాయలు చెల్లించి కొన్న విత్తనాలు నాటిన 70రోజులకూ దిగుబడి రాకపోవడంతో విత్తనాలు నకిలీవని తెలుసుకొన్న రైతు దిక్కుతోచని స్థితిలో పడిపోయాడు. మిగతా రైతులది ఇదే పరిస్థితి. లక్షల రూపాయలు పెట్టుబడులు పెట్టినా అసలు కూడా వచ్చే అవకాశం లేకుండా పోతోందని రైతులు బోరుమంటున్నారు.

# భూ కేటాయింపుపై వివాదం

**కావలీయులకు మద్దూరుపాడు ఎలా ఇస్తారని నిలదీత**

కావలి రూరల్ మండలం మద్దూరుపాడు గ్రామంలో పేదలకు ఇళ్ల నిర్మాణాలకు భూమి కేటాయింపుపై వివాదం నెలకొనింది. గ్రామంలోని 32 ఎకరాలను కావలి పట్టణానికి చెందిన లబ్దిదారులకు గృహనిర్మాణం కోసం రెవెన్యూ అధికారులు కేటాయించడం ఈ వివాదానికి తెరలేపింది. కావలి ప్రాంతం వారికి ఇవ్వరాదని గతంలోనూ మద్దూరుపాడు గ్రామస్తులు హైకోర్టు నుంచి స్టే తీసుకొచ్చారు. అధికారులు తాజాగా ఈ స్థలంలో శంకుస్థాపన చేయడంతో గ్రామస్తులు ఆగ్రహించారు. కోర్టు స్టే ఇచ్చి వున్నా పనులు ఎలా ప్రారంభిస్తారని నిలదీసిన గ్రామస్తులు ఆర్‌డిఓ, పోలీస్ అధికారులకు ఫిర్యాదు చేశారు. అధికారుల నుంచి తగిన స్పందన కరువవడంతో రాస్తారోకో చేశారు. ఈ సందర్భంగా ఎమ్పీటీసి వరమ్మ మాట్లాడుతూ గ్రామంలోని ఎంతో మందికి ఇంతవరకు ఇళ్ల స్థలాలు కేటాయించలేదన్నారు. అలాంటి అధికారులు కావలి పట్టణంలోని వారికి ఇక్కడి స్థలంలో ఇళ్ల కేటాయింపు ఎలా చేస్తారంటూ ప్రశ్నించారు. కోర్టు దృష్టికి అధికారుల వ్యవహారాన్ని తీసుకొని వెళతామని గ్రామస్తులు హెచ్చరించారు.

# పోలీసులను కొడుతున్న దొంగలు

**కప్పరాళ్ల తిప్పా... మజాకా?**

శాంతి భద్రతలను పరిరక్షించాల్సిన పోలీసులకే రక్షణ కరువైన దుస్థితి బోగోలు మండలం పోలీసులది. మండలంలోని బిట్రగుంట పోలీస్ స్టేషన్‌లో శ్రీకాంత్ కానిస్టేబుల్‌గా పని చేస్తున్నాడు. నైట్‌బీట్ చేసే అతను వివిధ ప్రాంతాలలో గస్తీ తిరుగుతున్న సమయంలో పూటుగా తాగిన ఐదుమంది వ్యక్తులు తమను ఎక్కడి నుండి వస్తున్నారని ప్రశ్నించినందుకు వారు కానిస్టేబుల్‌పై దాడి చేశారు. ఈ హఠాత్ పరిణామంతో బిత్తరపోయిన శ్రీకాంత్ తనపై జరిగిన దాడిని ఉన్నతాధికారులకు తెలియచేశాడు. ఈ సంఘటన ఆ ప్రాంతంలో కలకలం లేపింది. రంగంలోకి దిగిన కావలి డిఎస్పీ, సిఐ కృష్ణకిషోర్‌రెడ్డి దుండగులను పట్టుకొనేందుకు గాలింపు చర్యలు చేపట్టారు. కానీ ఒక్కరిని ఇంతవరకు పట్టుకోలేకపోవడం పోలీసుశాఖను ప్రజల్లో చులకన చేస్తుంది. ఏకంగా పోలీసులనే చితకబాదినా దిక్కులేని పోలీసులు ఇక ప్రజలను ఎలా రక్షణ కల్పిస్తారనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.



## కెసిఆర్ 'కో' దండం

తెలంగాణ రాష్ట్రసమితి అధ్యక్షుడు కెసిఆర్‌కు, పొలిటికల్ జెఎసి అధ్యక్షుడు ప్రొఫెసర్ కోదండరామ్‌కు మధ్య పచ్చ గడ్డి వేస్తే భగ్గుమంటోందట. కోదండరామ్‌ను ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలోకి తీసుక వచ్చింది కెసిఆర్. మొదట్లో కోదండరామ్ అణకువగానే వున్నా క్రమంగా టిఆర్ఎస్‌ను దూరం పెడుతున్నాడు. జెఎసి పరంగా తీసుకుంటున్న కీలక నిర్ణయాలు సైతం కెసిఆర్‌కు తెలీటం లేదు. ఈనెల 10న చేపట్టిన మిలియన్ మార్చ్ కార్యక్రమం కూడా కెసిఆర్‌కు ముందస్తుగా తెలీలేదు. పత్రికల్లో చూసి తెలుసుకున్నాడట. ప్రస్తుతం ఇంటర్ తదితర పరీక్షలు జరుగుతున్నాయి. ఈ సమయంలో ఇటువంటి ఆందోళనల వల్ల విద్యార్థులకు తీవ్ర అసౌకర్యం కలుగుతోంది. దీనివల్ల ఉద్యమం పట్ల వ్యతిరేకత పెల్లుబుకే ప్రమాదం వుందన్నది కెసిఆర్ అభిప్రాయం. అందుకే మిలియన్ మార్చ్‌ను పరీక్షలు పూర్తయ్యేవరకు వాయిదా వేయాలని కెసిఆర్ ఒత్తిడి చేశాడట. అయితే కోదండరామ్ మాత్రం ససేమిరా అన్నాడు. దీంతో కెసిఆర్ అగ్గి మీద గుగ్గిలంలా కోదండరామ్‌పై మండిపడుతున్నాడు. కోదండరామ్‌కు ఎలా కత్తెర వెయ్యాలన్న దానిపై కెసిఆర్ కసరత్తు చేస్తున్నట్లు టిఆర్ఎస్ పార్టీ వర్గాలు చెవులు కొరుక్కొంటున్నాయి.






## మళ్లీ 'మార్పుల' అస్త్రం

సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి మళ్లీ తన అంబులపొది నుంచి మంత్రివర్గ మార్పుల అస్త్రాన్ని తీశాడు. రాష్ట్రంలో 'రాజకీయం' అదుపుతప్పుతుండటంతో కిరణ్ నష్టనివారణకు మంత్రివర్గ మార్పులుంటాయని ప్రకటించాడు. ప్రత్యేక తెలంగాణ వాదానికి బ్రేకు వేయడానికి 'డిప్యూటీ సిఎం' పదవిని తిరిగి తెరపైకి తెచ్చాడు. అంతేకాకుండా కొత్తవారికి మంత్రి పదవులు, పాతవారికి శాఖల మార్పుల తాయిలాలుంటాయని చెబుతున్నాడు. చిన్నాచితకా నాయకులకు నామినేటెడ్ పోస్టుల్ని యిస్తానంటున్నాడు. ఈనెలాఖరుకు అసెంబ్లీ సమావేశాలు ముగిశాక పదవుల పందారం జరుగుతుందంటూ నోరూరించే కార్యక్రమం చేపట్టాడు. ప్రస్తుతం జరుగుతున్న శాసనమండలి స్థానిక ఎన్నికల్లో బాగా పనిచేసిన వారికి తగిన 'గుర్తింపు' వుంటుందని ప్రలోభపెడ్తున్నాడు. మొత్తానికి కిరణ్ పదవుల పందారం ఏ మేరకు 'కిక్' యిస్తుందో చూడాల్సిందే!!



## భాస్కర్‌కు 'రాజ'యోగం

సీనియర్ ఐఎఎస్ భాస్కర్‌కు త్వరలో రాజయోగం పట్టనుంది. చాలాకాలంగా లూప్‌లైన్లో వుంటున్న భాస్కర్‌ను తన పేషీకి తెచ్చుకోవాలని సిఎం కిరణ్ ఓ నిర్ణయానికొచ్చాడు. చీఫ్ సెక్రటరీగా వున్న ఎస్వీప్రసాద్ మరో రెండు నెలల్లో పదవీ విరమణ చేయనున్నాడు. ప్రస్తుతం సిఎం పేషీలో వున్న జె.సత్యనారాయణను చీఫ్ సెక్రటరీగా చేసి, ఆయన స్థానంలో భాస్కర్‌ను తెచ్చుకోవడానికి కిరణ్ ఫైలు సిద్ధం చేశాడట. భాస్కర్ ముక్కుసూటి మనిషి. నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి సిఎంగా వున్నప్పుడు ఆయన పేషీలో పనిచేసిన అనుభవం వుంది. గతంలో కిరణ్ సొంత జిల్లా చిత్తూరులో జాయింట్ కలెక్టర్‌గా చేసినప్పటి నుంచి భాస్కర్‌తో సిఎంకు మంచి పరిచయం వుంది. అదే ఇప్పుడు భాస్కర్‌కు 'రాజ'యోగం కట్టబెట్టనుంది.

## జగన్ పరేశాన్!



ఓదార్పు యాత్రల స్పెషలిస్ట్ జగన్‌కు శ్రీకాకుళం జిల్లాలో ఎదురు దెబ్బ తగిలింది. కాకరాపల్లి బాధితుల్ని పరామర్శించేందుకు వెళ్లిన జగన్‌ను స్థానికులు నిలదీశారు. శ్రీకాకుళం జిల్లాలోని సోంపేట, కాకరాపల్లి థర్మల్ విద్యుత్ కేంద్రాలకు వై.ఎస్ అనుమతించిన విషయాన్ని స్థానికులు గుర్తుచేస్తూ జగన్‌ను నిలదీశారు. దీంతో జగన్ ఖంగుతిన్నాడు. ఏం చెప్పాలో తెలీక చివరకు తన తండ్రి అవగాహన లేక ఇలా చేశాడని చెంపలేసుకున్నాడు. తాను ముఖ్యమంత్రి కాగానే సోంపేట, కాకరాలపల్లి విద్యుత్ కేంద్రాల అనుమతిని రద్దు చేస్తానంటూ ఉత్తర కుమార ప్రగల్భాలు పలికాడు. అయినా జనం మాత్రం నమ్మలేదు. నీ ఓదార్పు మాకేం అక్కర్లేదంటూ జగన్‌కు నిరసన తెలిపారు. దీంతో జగన్ పరేశాన్ అయి వెనక్కు తిరిగి వచ్చాడు. అన్ని ఓదార్పులూ ఒకేలా వుండవన్న సంగతి జగన్‌కు ఇప్పుడు తెలిసిందట.

● రైతుల ఇబ్బందులపై దృష్టిపెట్టని

# అధికారపార్టీ నేతలు, అధికారులు!

రైతు బ్రతుకుతో ఆటలాడుకోవడమంటే అటు అధికారులకు, ఇటు వ్యాపారులకు మహా సరదా. నోరులేని మూగ జీవి అన్న అలసత్వం రైతుకు సంబంధించిన ప్రతి అంశంలో కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. వ్యాపారుల దోపిడీ, అధికారుల అవినీతి, ప్రకృతి ప్రకోపం, కూలీల సమస్య, అప్పుల భారం, గిట్టుబాటు ధరలు లేని దుస్థితి వంటివన్నీ కలిసి రైతును అష్టదిగ్భంధనం చేస్తున్నాయి. వ్యవసాయం అంటేనే విరక్తి జనించే స్థితి కల్పిస్తున్నాయి.

ఇప్పుడు తాజాగా నెల్లూరు జిల్లాలో రైతులు ఎదుర్కొంటున్న సమస్య – ఎఫ్‌సిఐ గోడౌన్ల కొరత. నిజానికి రైతులకు, గోడౌన్లకు సంబంధమే లేదు. కానీ మిల్లర్లను వేధిస్తున్న ఆ సమస్య రైతుల పాలిట శాపంగా మారుతున్నది. నెల్లూరు జిల్లా మొత్తం మీద ఈ సీజన్‌లో దాదాపు పది లక్షల టన్నుల బియ్యం ఉత్పత్తి అవుతుంది. అందులో సగం, అంటే ఐదు లక్షల టన్నుల వరకు ఎఫ్‌సిఐకి లెవీ క్రింద సరఫరా చేయాలి. అయితే జిల్లాలో వున్న గోడౌన్ల వసతి 40వేల టన్నులు మాత్రమే. వ్యవసాయ సీజన్‌లో తేడాల వల్ల మనకంటే తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో పంట కోతలు ఒకటి రెండు నెలల ముందుగా జరిగిపోతాయి. దానితో ఆ జిల్లాల మిల్లర్లు, అధికారుల చేతులు తడిపి తమ బియ్యాన్ని నెల్లూరు జిల్లా గోడౌన్లకు తరలించి వేస్తున్నారు. మరొకప్రక్క ఒక్కొక్కసారి ఎఫ్‌సిఐ అధికారుల అవినీతి, జిల్లా రెవెన్యూ అధికారుల అలసత్వం వల్ల పంజాబ్ వంటి దూర ప్రాంతాల నుంచి కూడా ఇక్కడకు బియ్యం తరలించి నిల్వ చేస్తున్నారు. దానితో మనకు పంట దిగుబడి వచ్చి, లెవీ సరఫరా చేయబోయే సరికి గోడౌన్లలో ఖాళీ లేకుండా పోతున్నది. ఈ సాకు చూపించి రైసు మిల్లర్లు రైతులను చాలా నష్టపరుస్తున్నారు. మద్దతు ధర కంటే తక్కువకు వడ్లు కొంటున్నారు.

గత ఏడాదితో పోలిస్తే, ఈ సీజన్‌లో ధాన్యం ధరలు అమాంతం పతనమై పోయాయి. గత ఏడాది 15వేల వరకు అమ్ముడైన పుట్టి ఒడ్లు ఇప్పుడు 8వేలకు కూడా కొనే దిక్కు కన్పించడం లేదు. ఇందుకు చాలా కారణాలున్నాయి. వాటిలో, ఈ గోడౌన్ల సమస్య, జిల్లా రెవెన్యూ అధికారుల అవినీతి, అసమర్థతలు కూడా కీలక కారణాలు కావడం విచారకరం.

ఒక్క గోడౌన్ల కొరత వల్ల పుట్టికి వెయ్యి రూపాయల వరకు నష్టపోతున్నాడు రైతు. ఇది రెండు రకాలుగా జరుగుతున్నది. ఖాళీ లేకపోవడం వల్ల, చిత్తూరు జిల్లాకు ధాన్యం తరలించడం మొదటి కారణం. అక్కడి వరకు లారీకి రవాణా ఖర్చు 20వేల వరకు అవుతున్నది. కానీ మిల్లర్లకు ఎఫ్‌సిఐ ఇచ్చేది ఆరు వేల రూపాయల లోపు మాత్రమే. దానితో, తతిమా 14వేల రూపాయలను రైతు నెత్తిన రుద్దుతున్నారు మిల్లర్లు. అందుకోసం టన్నుకు వెయ్యి రూపాయల వరకు తగ్గించి కొంటున్నారు. మరొకప్రక్క, నెల్లూరుజిల్లాలోని గోడౌన్ల వద్ద బియ్యం తీసుకోవడంలో ఎఫ్‌సిఐ అధికారులు విపరీతమైన ఆలస్యం చేస్తున్నారు. వందలాది లారీలు గోడౌన్ల వద్ద నిలిచిపోతున్నాయి. ఒక్కొక్కసారి ఐదారు రోజుల వరకు వేచి వుండాల్సి వస్తున్నది. ఈ ఆలస్యానికి లారీకి రోజుకు 1200 రూపాయల లెక్కన వెయిటింగ్ చార్జీ కట్టవలసి వస్తున్నది. ఆ సాకుతో మరొక ఐదు వందల రూపాయలు తగ్గించి కొంటున్నారు మిల్లర్లు.


వరికి గిట్టుబాటు ధర కోసం కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న అఖిల పక్షం నేతలు.

## పోర్టు భూములపై శ్రద్ధ సగం పెడితే సమస్యే వుండదు

జిల్లా అధికారులు తలచుకొంటే ఇవి రెండూ పరిష్కారం వీలుకానంత పెద్ద సమస్యలేమీ కాదు. వ్యవసాయ సీజన్ ఎప్పుడు వస్తుందో అందరికీ తెలుసు. ఆ సమయానికి జిల్లాలోని గోడౌన్లలో ఇతర ప్రాంతాల ధాన్యం, బియ్యం

కొరవ 14వ పేజీలో

ట్రంకు రోడ్డు కబుర్లు




## అదృష్టవంతులు

శాసనమండలి ఎన్నికలలో నెల్లూరు స్థానిక సంస్థల నియోజకవర్గంలో ఓటర్లయిన ఎమ్పీటీసి, జడ్పీటీసి సభ్యుల ఓటు బంగారం కన్నా విలువగా మారింది. వీరిని ఇప్పటికే డబ్బు అనే అయస్కాంతంతో లాగేసిన కాంగ్రెస్, తెలుగుదేశం, జగన్ పార్టీల నేతలు చెన్నై, బెంగుళూరు, హైదరాబాద్‌లలో ప్రత్యేక శిబిరాలు పెట్టి మేపుతున్నారు. కొత్త అల్లుళ్లను మించిన మర్యాదలైన స్టార్ హోటళ్లలో బస, కోరిన ఫుడ్, మెచ్చిన బ్రాండ్ మద్యం, టైమ్‌పాస్‌కు షాపింగ్, సైట్ సీయింగ్‌కు తీసుకెళ్తున్నారు. ఇవన్నీ గాకుండా ఒక్కో ఓటరుకు ఎంత తక్కువ అనుకొన్నా రెండున్నర లక్షల రూపాయలు కూడా గిట్టుబాటు అయ్యింది. నాలుగు నెలల్లో తమ పదవీ కాలం ముగుస్తుండగా వచ్చిన ఎన్నికల వల్ల గిట్టుబాటు అయిన మొత్తాలతో మళ్లీ పోటీ చేయాలన్న వుబలాటం వీరిలో పెరిగిపోతోంది.

## నెల్లూరులో బీహార్ గ్యాంగులు!



పొట్ట చేత పట్టుకొని నెల్లూరు వచ్చిన బీహారీయులను నగర ప్రజలు వేరే రాష్ట్రం వారని చిన్నచూపు చూడక భవన నిర్మాణ రంగంలో పనిచ్చి ఆదుకొన్నారు. కానీ బీహారీయుల్లో కొందరు యువకులు పొట్ట నిండిన తర్వాత తమకు అలవాటైన దొంగతనాలకు దిగుతున్నారు. నగరంలో ఇటీవల మహిళల మెడల్లో చైన్లు లాగడం, ఇళ్లలో పగలు, రాత్రి తేడా లేకుండా దొంగతనాలు ఎక్కువయ్యాయి. పని చేసిన చోటును గుర్తు పెట్టుకొని మరీ 25ఏళ్ల లోపు బీహారీ యువకులు దొంగతనాలకు పాల్పడుతున్నారు. స్థానిక దొంగలనే పట్టను నానాపాట్లు పడుతున్న మన క్రైం పోలీసులు బీహారీ గ్యాంగుల వునికి కూడా ఇంతవరకు కనుక్కోకపోవడంపై ట్రంకురోడ్డులో విస్తృత చర్చ జరుగుతోంది.

## పట్టభద్రులకు విలువేది?




శాసనమండలిలో చిత్తూరు, నెల్లూరు, ప్రకాశం జిల్లాల పరిధిలోని పట్టభద్రుల నియోజకవర్గంలో 1,82,693 మంది ఓటర్లు నమోదై వున్నారు. ఈ నియోజకవర్గం నుంచి 12 మంది అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. విచిత్రమేమిటంటే వీరిలో ఏ ఒక్క అభ్యర్థి కూడా ఎన్నిక సమీపిస్తున్నా మొత్తం ఓటర్లను వ్యక్తిగతంగా కలిసి ఓటును అభ్యర్థించలేక పోయారు. పార్టీల తరపున పోటీ చేస్తున్న అభ్యర్థులు పార్టీ సమావేశాలు, వివిధ ప్రభుత్వ కార్యాలయాలు, స్కూళ్లకు వెళ్లి ఓట్లు అడగగలిగారు. ఓటరు లిస్టుల ఆధారంగా మాత్రం ఓటర్లను కలవలేకపోయారు. తమ ఓటుకు విలువ లేకుండా పోయిందని పట్టభద్రులు సణుగుతున్నారు. కానీ దీన్ని పట్టించుకొనేదెవరు?

## అందరూ కోటీశ్వరులే!

శాసన మండలి ఎన్నికలలో నెల్లూరు స్థానిక సంస్థల నియోజకవర్గం నుంచి పోటీ చేస్తున్న కాంగ్రెస్, తెలుగుదేశం, జగన్ పార్టీ అభ్యర్థులు తాము కోటీశ్వరులమని రిటర్నింగ్ అధికారికి అఫిడవిట్ ఇచ్చారు. వీరిలో కాంగ్రెస్ అభ్యర్థి వాకాటి నారాయణరెడ్డి కాస్త ఎక్కువగా ఆస్తిపాస్తుల లెక్క చూపారు. జగన్ పార్టీ అభ్యర్థి రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి ఈ లెక్కలో రెండవ స్థానంలో నిలవగా, తెలుగుదేశం అభ్యర్థి బీద రవిచంద్ర మూడవస్థానంలో నిలిచారు. కోటీశ్వరులు మినహా సామాన్యులు పోటీ చేయలేని స్థాయికి మండలి ఎన్నికలు వెళ్లిపోయాయని దీన్ని చూసి తెలుసుకోవచ్చు.

# వారఫలాలు

*తేది 12-3-2011 నుండి 18-3-2011 వరకు కుంభ, మీనాల్లో రవి; కుంభంలో కుజుడు; బుధ, గురువులు మీనంలో; మకరంలో శుక్రుడు; ధనుస్సులో రాహువు; కన్యలో శని; మిధునంలో కేతువు; వృషభ, మిధున, కర్కాటక, సింహాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




ఉన్నతాధికారుల నుండి సన్మాన ప్రాప్తి. మీ పలుకుబడి పెరిగే రోజు. ఇరుగుపొరుగువారు మీ మాటలకు విలువనిస్తారు. ఆరోగ్యం చక్కగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాల్లో పురోభివృద్ధి కానవస్తుంది. ధనాదాయం తృప్తికరం. ఆత్మీయులు మిక్కిలిగా ప్రోత్సాహమిస్తారు. సమాజంలో పరపతి పెరుగుతుంది. శుభవార్తాశ్రవణం. మిత్రుల వల్ల లాభప్రాప్తి. ఇతరులతో సంబంధాలు మెరుగ్గా ఉంటాయి.




ఆర్థిక సమస్యలు ఎదురవుతాయి. మాట నిలుపుకోలేరు. కాని తృప్తికరంగా కాలం గడుస్తుంది. నోరు పారేసుకోవద్దు. ప్రశాంతంగా కాలం గడపడం మంచిది. వ్యాపారులకు మంచి లాభావకాశాలు. పథకాలు ప్రయోజనవంతమయ్యే దినం. సాధుసత్సంగమావకాశాలు. ఎదురుచూడని ధనాదాయ లాభం. సోదరులతో సత్సంబంధాలుంటాయి. మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త.




ఇతరులపై మీదే పైచేయి. దూరం నుండి శుభవార్తాశ్రవణం. అప్పులు తీరుస్తారు. వృత్తి వ్యాపార ఉద్యోగాలలో మంచి ఆదాయం. వినోదాలలో కాలక్షేపం చేస్తారు. తృప్తికరమైన ఖర్చులు అధికం. స్థానచలనం లేదా ఉనికి మార్పిడి గురించి చర్చిస్తారు. ఉద్యోగులకు పనిభారం అధికం. ఆకస్మిక ప్రయాణావకాశాలున్నాయి. నూతనోత్సాహంతో పనులు జరుపుకుపోతారు. అధికారుల నుండి మేలు వార్త.




శ్రమాధిక్యత ఆరోగ్యభంగము. ఎదురుచూసిన డబ్బు చేతికందుతుంది. ప్రయాణాలు సత్ఫలితాన్నిస్తాయి. దైవకార్యాలలో పాలుపంచుకొంటారు. విందులు వినోదాలతో కాలం గడపుతారు. నిరంతరపరిశ్రమతో పనులు నిర్వహిస్తారు. ఆర్థికలావాదేవీలు సత్ఫలితాల్నిస్తాయి. దైవ, పుణ్యకార్యాల వైపు మనసు పోనిస్తారు. ఆదాయం తృప్తికరంగా ఉంటుంది. భూభవనాలు కొనే ప్రయత్నాలు చేస్తారు.




ధన విషయాలలో ఆదుర్దా. నష్ట ప్రాప్తి. సంతానమూలంగా కొంత శాంతి. సమస్యలున్నా సర్దుబాటు అవుతుంది. ఇతరులతో మాట పట్టింపు పనికి రాదు. వ్యాపారులకు లాభావకాశాలు. నిలచి నిదానంగా ఆలోచించి పనులు నిర్వహించాలి. మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. పొదుపు గురించి చింతిస్తారు. వృత్తిలో ముందంజ వేస్తారు. సమాజంలో గౌరవమర్యాదలు పెరుగుతాయి.




మనస్పర్ధలు, వృథావాదోపవాదాలు. పొత్తికడుపునకు సంబంధించిన అనారోగ్య బాధ. ప్రయాణాలలో నష్టం. వైద్య ఖర్చులు. శుభకార్యాచరణ. సత్సంగమం. దూరాలోచనతో స్థిరధనాదాయాలకు ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ముఖ్య నిర్ణయాలు తీసుకొంటారు. బంధుమిత్రులు సహాయ సహకారాలు అందిస్తారు. కుటుంబసభ్యులతో అనుకూలంగా నడుచుకోవాలి. మనశ్చింత ఉండవచ్చు.

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

14తేదీ మేష లగ్నాన ఉ.8.00 నుండి 10.00 గంటల వరకు.
16తేదీ మకర లగ్నాన తె.3.00 నుండి 05.00 గంటల వరకు.
17, 18తేదీల్లో వృశ్చిక లగ్నాన రా.10.00 నుండి 12.00 గంటల వరకు శుభ ముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు
### ఫాల్గుణ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 12 | శని | సప్తమి | సా.4.41 | గం.ల.వ |
| 13 | ఆది | అష్టమి | సా.5.12 | గం.ల.వ |
| 14 | సోమ | నవమి | సా.4.45 | గం.ల.వ |
| 15 | మంగళ | దశమి | సా.3.28 | గం.ల.వ |
| 16 | బుధ | ఏకాదశి | మ.1.23 | గం.ల.వ |
| 17 | గురు | ద్వాదశి | ఉ.10.35 | గం.ల.వ |
| 18 | శుక్ర | త్రయోదశి | ఉ.7.14 | గం.ల.వ |
| | | చతుర్దశి | తె.3.29 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




మంచి విజయ ప్రాప్తి. అనుకొన్నవి అనుకొన్న రీతిలో సాధించుకొంటారు. విరోధులు అణిగి ఉంటారు. వృత్తిలో మంచి అవకాశాలు. ధన వ్యయం. వృత్తిలో అవకాశాలు జార విడుచుకోవద్దు. పనులు చక్కగా పథకం ప్రకారం నిర్వహిస్తారు. ప్రియ వార్తాశ్రవణం. మిత్రుల వల్ల సాయమందుతుంది. కళత్రసుఖం చక్కగా వుంటుంది. ధనాదాయం బాగుంటుంది. మంచితనంతో బాకీలు వసూలౌతాయి.




నిరుపయోగమైన పనులలో తలమునకలవుతారు. తోటివారిలో అమర్యాద ప్రాప్తి, వృథా వాదోపవాదాలు చోటు చేసుకొంటాయి. వాహన ప్రమాదావకాశాలు జాగ్రత్త. వ్యాపారులకు సామాన్యంగా వుంటుంది. రోగ నివృత్తి ద్వారా సుఖసంతోషాలు. ఉద్యోగంలో మార్పును గూర్చి ఆలోచిస్తారు. పనుల్లో ఆటంకం. పరిచితుల కోసం ధనం, కాలం వెచ్చించవలసి వస్తుంది. విశ్రాంతి తక్కువ.




సుఖసంతోషాలకు కొదువ ఉండదు. ఆస్తి సమకూర్చుకొనే ప్రయత్నాలు చేస్తారు. పలుకుబడి పెరుగుతుంది. ఎదురుచూసిన తావులో ధనప్రాప్తి. వృత్తిలో అమోఘం. కళాకారులకు మేలు. మనశ్శాంతి చక్కగా ఉంటుంది. శుభకార్యాల్లో పాల్గొంటారు. దూరాహ్వానాలు లాభాల్నిస్తాయి. భూసంపదను పెంచుకొనే యోచన చేస్తారు. ఆత్మవిశ్వాసంతో పనులు జరుపుకొంటారు. బంధుమిత్రుల సమాగమం.




ఆర్థిక లావాదేవీలు సత్ఫలితాన్నిస్తాయి. ప్రయోజనవంతమైన పనులలో మనసు పోనిస్తారు. శుభవార్తాశ్రవణం ఉంటుంది. జీర్ణకోశ బాధలుంటాయి. అప్పుల సమస్యలు తీరే ప్రయత్నాలు చేస్తారు. ఊహలు నిజమయ్యే రోజు. బంధుమిత్రవర్గంతో హాయిగా కాలక్షేపం చేస్తారు. సోదరులు మిత్రులు చక్కగా సాయమందిస్తారు. అనుకొన్నవి సాధిస్తారు. అనుకొన్నరీతిలో పనులు సాధించుకొంటారు.




విశ్రాంతి లోపం. ఆవేదనకు గురౌతారు. సమాజ కార్యక్రమాలలో బాధ్యత పెరుగుతుంది. సుఖం కొరవడుతుంది. అనుకోని వ్యయ సూచనలు. వృత్తిలో శ్రమానంతర లాభాలు. బంధుమిత్రుల వల్ల లాభాలు. దైవచింతనలో మనసు పోనివ్వాలి. ప్రతి పని దీర్ఘంగా ఆలోచించి చేయాలి. నష్టావకాశాలు. అనవసరపు ఖర్చులు. ముందుచూపు అవసరం. ఆనందం. ఒత్తిడి. నూతన వస్త్రాభరణాలు కొంటారు.




ఆవేదనకు గురౌతారు. సమాజ కార్యక్రమాలలో బాధ్యత పెరుగుతుంది. సుఖం కొరవడుతుంది. అనుకోని వ్యయ సూచనలు. వృత్తిలో శ్రమానంతర లాభాలు. బంధుమిత్రుల వల్ల లాభాలు. సమాజంలో గౌరవమర్యాదలు పెరుగుతాయి. మృదుభాషణతో పనులు సాధించుకొంటారు. సంతాన మూలంగా లాభాలు. శుభవార్తాశ్రవణం. బంధుమిత్రుల తోటి విరోధభావం తొలగుతుంది.

# 'ఏకశీతి' పద మర్మసంధి, వాస్తు చిత్రం విశ్లేషణలు!

*డాక్టర్ జనరావుశాస్త్రి — బెంగుళూరు*

* *ఏకశీతి పద వాస్తు చిత్రానికీ, మర్మసంధికి గల భేదం ఎట్లాంటిది?*

'మయ వాస్తు'లో ఈ విశ్లేషణలున్నాయి. రెండు చిత్రాలలోనూ 81 గదులుంటాయి. ఏకశీతి పద దేవతా చిత్రం ఒకటి, చిత్రం చివరి గదుల్లో కోణ సంధుల్ని తెలిపే చిత్రం మరొకటి వుంటాయి. భేదం ఇంతే!

*డాక్టర్ ఎమ్.జాని — బెంగుళూరు*

* *ఆగమ శాస్త్ర పరిధి బహమనీ రాజ్య పతనానంతరం ప్రఖ్యాతి చెందిందట నిజమేనా?*

బహమనీ రాజ్య కాలంలో కూడా ఆగమ వాస్తు పారశీ, ఆఫ్ఘన్ కళారీతులతో ప్రఖ్యాతి చెందింది. ఆ తర్వాత బీజాపూర్‌లోని 'జన్‌జీరీ' మిహతార్‌మహల్ మసీదులు ఆగమ శాస్త్రయుక్తంగా నిర్మించబడ్డాయి.

*ఎం.తిరుపతిరెడ్డి — తడ*

* *ఈశాన్యం బ్లాకు ఉత్తరం వీధి గోడకు తగిలి ఆగిపోయింది.*

ఏ బ్లాకులోనైనా వీధులు సమాంతరంగా వెళ్లిపోవాలి. ఆగడం ఇంటికి దృష్టి దోషాన్నిస్తుంది.

*పి.వి.సీతాసదానంద్ — నెల్లూరు*

* *గృహం ప్రారంభించాము. మూఢమనీ, ఇతరత్రా కారణాల వల్ల నిర్మాణాన్ని చాలాకాలం ఆపాము.*

గృహ నిర్మాణ సమయంలో ఈశాన్యపు గదిలో సుదర్శన యంత్ర ప్రతిష్టచేసి నిర్మాణాలు కొనసాగించవచ్చును. మౌఢ్యమి వంటి దోష కాలాన్ని పాటించవలసిన అవసరం లేదు.

*కె.శంకరనారాయణ — చెన్నై*

* *వీధిపోటు ఒక ప్లాటుకేనా? వరుస క్రమంలో అన్నింటి పైనా వుంటుందా?*

వీధిపోటు, చూపు లేఅవుట్ హద్దు వరకూ వరుస క్రమంలో అన్ని ప్లాట్లపైనా వుంటుంది.

*డాక్టర్ ఎ.విజయకుమార్ — విజయవాడ*

* *వాస్తు సామాన్యులకు కాదా? రాజులకు మాత్రమేనన్న ఒక అపప్రథ వున్నది?*

మీరు విన్నది నిజంకాదు. సామాన్యుడి పూరిళ్ల నుంచి రాజభవనాల వరకూ వాస్తు సిద్ధాంతాల్ని 28 వాస్తు గ్రంథాలు రాశాయి. అయితే 'మానసారం' అనే వాస్తు గ్రంథం రాజభవన నిర్మాణాలను గురించి ఎక్కువగా రాసింది.

*పి.రఘురామరెడ్డి — విజయవాడ*

* *వాస్తు సమతుల్యత లోపించినపుడేం చేయాలి?*

పంచ భూతాలైన భూమి, అగ్ని, వాయువు, జలం, ఆకాశం సమతుల్యత కోల్పోయిన గృహాల్లో ద్వార గవాక్ష సాపేక్ష సిద్ధాంత వల్లనూ, యంత్ర ప్రతిష్టల చేతనూ దోషాల్ని పరిహరింపజేయవచ్చు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.సత్యనారాయణ — విశాఖపట్నం*

* *మా అమ్మవల్ల ఆమె చనిపోయింది. నలభై రోజుల నుండి వింత శబ్దాలు వినిపిస్తాన్నాయి.*

పూర్ణాయువు తీరక మరణిస్తే ఆత్మలవుతారన్న మాట వాస్తవమే. మండలం(నలభై రోజులు) తర్వాత ఆత్మకు 'శక్తి' ఆవాహన అవుతుందని 'మాంత్రిక భైరవి' చెబుతోంది.

*ఏడిదం విజయలక్ష్మి — నెల్లూరు*

* *పెద్దోడు చదువు మానేసి 'సోదా'లతో తిరుగుతున్నాడు. అమ్మాయి అత్తారింటి నుంచి వచ్చి కాపురం చేయనంటున్నది.*

తూర్పు ఆగ్నేయంలోని సెప్టిక్ ట్యాంకును వెంటనే పూడ్చివేసి, అతనికి సైకియాట్రిస్ట్ దగ్గర కౌన్సిలింగ్ ఇప్పించండి. అమ్మాయి వైరాగ్యానికి కారణం విచారించండి. అమ్మాయి త్వరపడి వుంటే 'పుష్యరాగ' ధారణ చేయించండి. పరిస్థితి చక్కబడుతుంది.

*శకుంతలా దేశ్‌ముఖ్ — చెన్నై*

* *ఆగమ శాస్త్రయుక్త హిందూవేతర కట్టడాలు బీజాపూర్‌లో కనిపిస్తున్నాయి. వాటిని గురించి విశేషాలు చెప్పగలరా?*

బీజాపూర్‌లోని జామీ'మసీదు', అలీషా హిందపీర్ మసీదు, గగన్‌మహల్ నిర్మాణము ఆగమ వాస్తు శాస్త్రాలకనుగుణంగా నిర్మించబడ్డాయి. రెండవ ఇబ్రహీం పరిపాలనా కాలంలో క్రీ.శ 1580-1627 మసీదులలో అలంకరణలకు అత్యంత ప్రాధాన్యత ఇవ్వబడింది.

# నిధులు లేక స్తంభించిన పాలన!

> "రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి సరిగా లేకపోవడం వల్ల జిల్లాకు విడుదల కావాల్సిన నిధులు పూర్తిగా నిలచిపోయాయి. దీని ప్రభావం అన్ని ప్రభుత్వ శాఖల మీద పడింది."

రాష్ట్రంలో ఏర్పడిన రాజకీయ అనిశ్చితి కారణంగా జిల్లాలో పరిపాలన కొంతమేర స్తంభించింది. తెలంగాణ వాదుల ఆందోళనల కారణంగా ఆర్థిక సంక్షోభం ఏర్పడింది. రాష్ట్ర ప్రభుత్వానికి జమకావాల్సిన నిధులు జమ కాకపోవడంతో జిల్లాలో అమలు చేయాల్సిన పలు పథకాలకు బ్రేకు పడింది. ఇప్పటికే ప్రతి మూడు నెలల కోసారి జిల్లా ఖజానాపై బిల్లుల చెల్లింపు నిలిపివేయాలని ఆర్థికశాఖ నుంచి ఆదేశాలు జారీ అవుతున్నాయి. ఆర్థిక సంవత్సరం గడువు ఈనెలతో ముగియనుండడంతో అన్ని శాఖల నుంచి ట్రెజరీలకు అధిక మొత్తంలో బిల్లులు చేరాయి.

ఆర్థిక పరిస్థితి సరిగాలేకపోవడంతో జిల్లాకు విడుదల కావాల్సిన నిధులు పూర్తిగా నిలిచిపోయాయి. ప్రభుత్వం నిధుల కేటాయింపు చేసిందే తప్ప విడుదల చేసేందుకు కృషి చేయడం లేదు. పేద, బడుగు, బలహీన వర్గాల వారికి అమలు చేసే సంక్షేమ పథకాలకు నిధుల కొరత ఏర్పడింది. 2009-10 సంవత్సరంలో బ్యాంకు లింకేజీ పథకాలకు విడుదల చేయాల్సిన సబ్సిడీ నిధులు నేటికి అందలేదు. ఈ 2010-11 సంవత్సరానికి సంబంధించిన నిధులు అసలు విడుదల జరగలేదు. దీంతో కొన్ని బ్యాంకులు రుణాలు మంజూరు చేసేందుకు నిరాకరించాయి. జిల్లాలో ప్రధానంగా పంచాయితీరాజ్, రోడ్లు, భవనాలశాఖ, గృహనిర్మాణసంస్థ, నీటిపారుదల శాఖలు కోట్ల రూపాయల బిల్లులు కాంట్రాక్టర్లకు చెల్లించాల్సి వుంది.

కాంట్రాక్టర్లకు గత రెండు నెలల నుంచి చేసిన పనులకు బిల్లులు చెల్లించకపోవడంతో మిగిలిన పనులు పూర్తికాకుండా పోయాయి. ఆర్థిక సంవత్సరం గడువు ముగిసేలోపల బిల్లులు వస్తాయని ఆశతో ఎదురుచూసిన కాంట్రాక్టర్లకు నిరాశే మిగిలింది. కేవలం అధికారులు, సిబ్బంది వేతనాలు మాత్రమే ఈనెలలో చెల్లింపులు జరిగాయి. ప్రభుత్వ కార్యాలయాల అద్దె, విద్యుత్ బిల్లులు, టెలిఫోన్ బిల్లులు, వాహనాల అద్దె తదితర బిల్లులు మంజూరుకు నోచుకోలేకపోయాయి. ఏ ప్రభుత్వ శాఖ వద్ద అవసరమైన నిధులు లేకపోవడంతో సంబంధితశాఖ అధికారులు కార్యాలయాలకే పరిమితం కావాల్సి వచ్చింది.

ప్రజల నుంచి పలు సమస్యలపై వినతులు వస్తున్నా ఏదో ఒక సమాధానం చెప్పి పంపేస్తున్నామేగాని సమస్యలను పరిష్కరించలేక పోతున్నామని పేర్లు వెల్లడించేందుకు ఇష్టపడని పలువురు అధికారులు వ్యాఖ్యానించారు. ఒక్క మన జిల్లాలోనే కాకుండా రాష్ట్రవ్యాప్తంగా ఇదే పరిస్థితి కొనసాగుతోంది. ఆర్థిక సంక్షోభం కారణంగా జిల్లాలో పరిపాలన సాగడం లేదు. మరోప్రక్క శాసనమండలి ఎన్నికల నిర్వహణ కోసం ఎన్నికల సంఘం నోటిఫికేషన్ జారీచేసి వుంది. ఈ నోటిఫికేషన్‌తో జిల్లాలో ఎమ్మెల్సీ ఎన్నికల ప్రచారంలో ప్రజాప్రతినిధులు నిమగ్నమై ప్రజల సమస్యల గురించి మరచిపోయారు.




నామమాత్రమైన జిల్లా ట్రెజరీ కార్యాలయం.

ఎన్నికల కోడ్ అమల్లో వుండడంతో అధికారిక కార్యక్రమాలకు ప్రజాప్రతినిధులు దూరంగా వుంటూ తప్పించుకుంటుండగా, నిధులు లేకుండా తాము ఏం చేయగలమని అధికారులు వాపోతున్నారు. ప్రభుత్వ ఆధ్వర్యంలో చేపట్టాల్సిన పనులు మొత్తం నిలిచిపోయాయి. జిల్లాలో పరిపాలన స్తంభించిపోవడంతో సామన్య ప్రజలు సతమతమవుతున్నారు.

అవినీతి జమానా

# ఆరోగ్యశ్రీ పథకం అమలులో పలు లోసుగులు!

**జిల్లాలో ఈ పథకం అమలవుతున్నా కొన్ని ఆసుపత్రులు నేటికీ వైద్య ఆరోగ్యశాఖాధికారి కార్యాలయంలో రిజిస్ట్రేషన్లు చేయించుకోలేదు. అయినా ఆరోగ్యశ్రీ ట్రస్టు మార్గదర్శకాలకు విరుద్ధంగా వీరికి నిధుల విడుదల ఆశ్చర్యపరుస్తుంది.**

పేద ప్రజలకు వైద్యం అందించాలన్న సంకల్పంతో రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకం ప్రవేశపెట్టబడింది. ఈ పథకం వుద్దేశం, లక్ష్యం మంచిదే అయినా వర్తింప చేసే విషయంలో ఆరోగ్యశ్రీ ట్రస్టు నిర్వాహకులు మార్గదర్శకాలకు తిలోదకాలిచ్చారు. ఆరోగ్యశ్రీ పథకం అమలుకోసం దరఖాస్తు చేసుకున్న ఆసుపత్రుల గురించి పూర్తి సమాచారం తెలుసుకోకుండానే ట్రస్టు ప్రతినిధులు గుర్తింపును జారీ చేయడం ఆశ్చర్యానికి గురి చేస్తోంది. ప్రభుత్వ నిబంధన ప్రకారం ప్రైవేటు ఆసుపత్రులు నిర్వహిస్తున్నారా లేదా వీటిలో రోగులకు అవసరమైన అన్ని మౌలిక సదుపాయాలు వున్నాయా అన్న దాని గురించి పరిశీలన జరపకుండానే అమలు చేసే బాధ్యత అప్పగించేశారు.

ఆరోగ్యశ్రీ పథకం అమలుకోసం గుర్తింపు ఇవ్వాలంటే ముందుగా సంబంధిత ఆసుపత్రిని జిల్లా వైద్య ఆరోగ్యశాఖ కార్యాలయంలో రిజిస్ట్రేషన్ చేయాలి. రిజిస్ట్రేషన్ నెంబర్ జారీ అయిన తర్వాతనే ఆరోగ్యశ్రీ ట్రస్టుకు దరఖాస్తు చేయాల్సి వుంటుంది. జిల్లాలో నెల్లూరు నగరంతోపాటు కావలి, గూడూరు ప్రాంతాల్లో దాదాపు 12 ఆసుపత్రులు ఆరోగ్యశ్రీ పథకం గుర్తింపును పొందాయి. వీటిలో కొన్ని మాత్రమే గుర్తింపు వచ్చిన తర్వాతనే రిజిస్ట్రేషన్ చేయించుకోవడం విశేషం. నేటికీ ఈ పథకం అమలు చేసే ఆసుపత్రులతోపాటు మరి కొన్ని ఆసుపత్రులు రిజిస్ట్రేషన్ చేయించుకోలేదు. ఆరోగ్యశ్రీ ట్రస్టు మార్గదర్శకాలకు విరుద్ధంగా పథకం అమలు చేస్తున్నా వాటికి కోట్ల రూపాయల నిధులు వైద్యం కోసం విడుదలయ్యాయి.

రాజకీయ ఒత్తిడితోనే ఆరోగ్యశ్రీ ట్రస్టు నుంచి రిజిస్ట్రేషన్ లేని ఆసుపత్రులకు నిధులు విడుదలయ్యాయన్న ఆరోపణలున్నాయి. ఆరోగ్యశ్రీ ట్రస్టులో కీలక బాధ్యతలు నిర్వహించిన కొందరు అధికారులు సైతం కార్పొరేట్ ఆసుపత్రుల యాజమాన్యాల ప్రలోభాలకు లొంగి ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారన్న విమర్శలు లేకపోలేదు. పేదలకు వివిధ రకాల వ్యాధులకు శస్త్రచికిత్సలు నిర్వహించాలని భావించిన రాష్ట్రప్రభుత్వం ప్రైవేట్ ఆసుపత్రుల పనితీరుపై సరైన దృష్టి సారించలేకపోయింది. ఈ బాధ్యతలను ఆరోగ్యశ్రీ ట్రస్టుకు అప్పగించడంతో అక్కడి నిర్వాహకులు గుర్తింపు వున్నా లేకపోయినా వాటికి ఆరోగ్యశ్రీ పథకం అమలుకు అనుమతి ఇచ్చేస్తున్నారు.

గుర్తింపు పొందిన ఆసుపత్రులలో శస్త్రచికిత్సలు చేసే వైద్యులు వుండడం లేదు. బయట ఆసుపత్రుల నుంచి వైద్యులను రప్పించి శస్త్ర చికిత్సలు చేయిస్తున్నారు. మరికొందరు ప్రైవేటు వైద్యులు తమ ఆసుపత్రికి వచ్చిన రోగులను ఆరోగ్యశ్రీ పథకం అమలు చేసే ఆసుపత్రులలో చేర్పించి శస్త్ర చికిత్సలు చేస్తున్నారు. ఇలా చేయడం ఆరోగ్యశ్రీ ట్రస్టు నిబంధనలకు పూర్తిగా విరుద్ధం. ఈ విషయం ఆసుపత్రులలో విధులు నిర్వహించే ఆరోగ్య మిత్రలకు తెలిసినా కూడా సంబంధిత కో ఆర్డినేటర్ దృష్టికి తీసుకెళ్లడం లేదు. ఆరోగ్యశ్రీ కార్డులను పరిశీలించి ఆన్‌లైన్‌లో దరఖాస్తు నింపడం ఆరోగ్య మిత్రలు చేస్తుంటారు. రోగులకు అవసరమైన సూచనలు, సలహాలు ఇవ్వడంతోపాటు ఇబ్బందులు లేకుండా చూడడం వీరి బాధ్యత. ఆరోగ్య మిత్రలుగా నియమించబడిన వారు దీర్ఘకాలంగా ఒకే ఆసుపత్రిలో విధులు నిర్వహించడం వల్లనే ఆయా ఆసుపత్రుల యాజమాన్యాలతో సంబంధాలు ఏర్పరచుకొని రోగుల బాగోగుల గురించి పట్టించుకోవడం మానేస్తున్నారు. ఆరోగ్యశ్రీ పథకం వల్ల లబ్ధి పొందే రోగులు వారికి ఎదురయ్యే సమస్యలు చెప్పుకొనేందుకు ఎవరూ అందుబాటులో వుండడం లేదు. జిల్లా కో ఆర్డినేటర్‌గా వ్యవహరిస్తున్న డాక్టర్ బిసి.నారాయణ ఫోన్ నెంబర్ వున్నా ఆయన ఎప్పుడూ అందుబాటులోకి రావడం లేదని రోగుల బంధువులు కొందరు వాపోయారు. ఆరోగ్యశ్రీ ట్రస్టు నిబంధనలకు అనుగుణంగా లేని ఆసుపత్రులకు నిధులు విడుదల చేయడంపై కొన్ని ప్రజా సంఘాలు హైకోర్టులో కేసు వేసేందుకు సన్నాహాలు చేస్తున్నాయి.

# బాలీవుడ్‌కు వెళ్లను!

హీరోయిన్ కాజల్ చేతిలో మిస్టర్ పర్‌ఫెక్ట్, వీర, మెరుపు సినిమాలున్నాయి. వీటితోపాటు నాగచైతన్యతో ఓ సినిమా చేస్తోంది. కాజల్‌కు ఈ మధ్యే బాలీవుడ్ నుంచి కూడా పిలుపొచ్చింది. ఇక బాలీవుడ్‌కు మకాం మార్చేసినట్టేనా అంటే; అలా పొరపాటు పడొద్దు. ఓ హిందీ సినిమాలో అవకాశం వచ్చింది... నటిస్తున్నానంతే. ఈ సినిమా ఒప్పుకొన్నానని ఇక బాలీవుడ్‌లోనే స్థిరపడిపోయాను అనుకోవద్దు. మంచి దర్శకులతోనూ, అనుభవం వున్న నటులతోనూ పని చేయాలని వుంది. ఆ అవకాశం ఏ భాషలో వచ్చినా స్వీకరిస్తాను. తెలుగు సినిమాలంటే నాకు చాలా ఇష్టం. నాకు గుర్తింపు వాటి వల్లే వచ్చింది. అందుకే నా తొలి ప్రాధాన్యత టాలీవుడ్‌కేనంది.



# ఎవరి జీవితం వాళ్లదే!



ఒట్టి మాటలతో కాలాన్ని వృధా చేసుకోవద్దంటుంది హీరోయిన్ అందాల అనుష్క. ఎవరైనా వారి తాత ముత్తాతల గొప్పదనాన్ని చూసి మురిసిపోవడం కాదు. మనం కూడా ఆ స్థానంలో వుండడానికి ప్రయత్నించాలి. అయినా ఎదుగుదలను మరొకరు ప్రభావితం చేస్తారు అనుకోను. ఎవరి జీవితం వాళ్లదే. ఎవరి గెలుపు వారిదే. ఫలానా సినిమా నేను చేస్తే... ఈ పాటికి ఆ హిట్ నాకే దక్కేదికదా... అని ఎప్పుడు లెక్కలేసుకోలేదు. ఒకసారి నా చేతిలోంచి జారిపోయిన అవకాశం గురించి మళ్లీ ఆలోచించను. అది కాలయాపన మాత్రమే అని చెప్పుకొచ్చింది అనుష్క.

# పెళ్లి చేసుకోవాలి!

సెక్సీయెస్ట్ భామగా అంతర్జాతీయ గుర్తింపు పొందిన హీరోయిన్ కత్రినా కైఫ్ హిందీలో తన హవాను కొనసాగిస్తుంది. యువతరం కలల రాణి కత్రినా తన మనసులోని కోరికను ఇటీవల బయటపెట్టి అందరినీ కలవరానికి గురిచేసింది. అదేమిటంటే 33ఏళ్లలోపే తాను తల్లి కావాలనుకొంటుందట. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ నా బాల్యం అంతా ఎక్కువగా ఒంటరిగానే గడిచింది. చిన్ననాటి రోజుల్లో ఫ్రాన్స్, జపాన్, లండన్ ఇలా పలు దేశాలు చుట్టొచ్చాను. ఈ వయస్సులో ఇంకా ఒంటరిగా గడపడం నాకు అంతగా ఇష్టంగా లేదు. అంతా అనుకొన్నట్లు జరిగితే ఓ అందమైన అబ్బాయిని పెళ్లి చేసుకొని కనీసం ఇద్దరు, ముగ్గురు బిడ్డలకు తల్లిని కావాలనుకొంటున్నా. ఇదంతా కూడా 33 ఏళ్లలోపే జరిగిపోవాలన్నది నా కోరికంది కత్రినా.



# ఊహ... వాస్తవం వేరు



అందాలు ప్రదర్శించి బాలీవుడ్‌లో హీరోయిన్‌గా గత ఏడేళ్లుగా కొనసాగుతున్న నేహా ధూపియా తెలుగులోనూ పలు చిత్రాల్లో ప్రత్యేక పాత్రలు, పాటల్లో నటించింది. ఇటీవల బాలకృష్ణతో పరమవీరచక్రలో కీలకపాత్ర పోషించింది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన నేహా ధూపియాను చిత్ర పరిశ్రమలో ఎలా అనిపిస్తోంది మీ ప్రయాణానికి అని అడిగితే, సమాధానంగా ఏడేళ్ల కాలంలో రకరకాల మార్పులను గమనించా. కొత్తగా వచ్చినప్పుడు ఏవేవో ఊహించుకున్నా. ఊహలు వేరు, వాస్తవం వేరని తెలుసుకొనేసరికి ఏడు సంవత్సరాలు గడిచిపోయాయి. నేనేంటో నాకు బాగా తెలుసు. మాట్లాడేటప్పుడు రెండడుగులు వెనకేసి మాట్లాడతా. మాట్లాడిన తర్వాత నాలుగు అడుగులు ముందుకేసే అలవాటు నాది. అల్లరి చిల్లరి మాటలు నేనసలు పట్టించుకోనంది ఈ భామ.



# భయపెట్టే 'మంగళ'

అల్లూరు రహీం

నెల్లూరీయుడు, యువ దర్శకుడు తులసీరామ్ మూడేళ్ల క్రితం తీసిన మంత్ర చిత్రం ఘనవిజయం సాధించి అతనికి పరిశ్రమలో మంచి గుర్తింపును తెచ్చిపెట్టింది. ఆ ఉత్సాహంతోనే ఛార్మిని హీరోయిన్‌గా పెట్టి ద్వితీయ యత్నంగా మంగళ చిత్రాన్ని తీశాడు. మంత్ర తంత్రాలు, చేతబడిని మించిన క్షుద్ర విద్య 'శకూచి'ని పరిచయం చేస్తూ తీసిన చిత్రమే యిది. మంత్రాలు, తంత్రాలను ప్రక్కన పెడితే రెండుగంటల ఈ సినిమాను మంచి స్క్రీన్‌ప్లేతో దర్శకుడు ప్రేక్షకులు చూడగలిగేలా తీయగలిగాడు. ఛార్మి అతిగానే నటించిన రెండు పాటలు దోరదోర మోహం, ఐస్ ఐస్ ఆకట్టుకోకపోయినా చిత్రంలో వుద్విగ్న భరితంగా రూపొందించిన సన్నివేశాలు ప్రేక్షకులను రోమాంచితులను చేస్తాయి. శకూచి ఆవహించిన ఓ యువకుడు పడే యాతనతోపాటు, ఈ విద్యను ప్రయోగించిన మాంత్రికుడు అతని కుమారుని తలకోసి చేతబట్టడం, నల్లచీర ధరించి వెళ్తున్న ఛార్మిని శకూచి వెంబడించడం, గదిలో దుప్పటి లాగేయడం, పున్నమి రోజు నిండు వెన్నెలలో ఈగ రూపంలో ఆవహించడం, వున్నట్లుండి ఛార్మి కుర్చీలో నుంచి ఫట్ మని మాయమవడం, మాంత్రికుడు కాబా చేసే పూజలో కపాలాలు చుట్టూ పరిభ్రమించడం, వందలాది అఘోరాల శివతాండవం వంటి సన్నివేశాలు చిత్రం చూస్తున్న ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలకు గురి చేస్తాయి. బడ్జెట్ లేక శివలింగం ప్రత్యక్షమయ్యే సన్నివేశాన్ని నిర్మాత కూడా అయిన దర్శకుడు తులసీరామ్ అంత ఘనంగా చిత్రీకరించలేకపోయాడు. రాత్రివేళల్లో షూటింగ్‌ను అనుభవం లేకపోయినా కెమెరామెన్లు చక్రవర్తి రెడ్డి, దాశరథి శివేంద్ర చక్కగానే చిత్రీకరించారు. పగటిపూట లైటింగ్‌లో ఎందువల్లో వారు తీసిన సన్నివేశాలు సరిగ్గా లేవు. ఆనంద్ నేపథ్య సంగీతం బాగుంది. ఈ చిత్రంలో పాటలు సుద్దాల అశోక్ తేజతో కాకుండా మరొకరితో వ్రాయిస్తే ప్రయోజనముండేది.

చిత్రకథలోనికి వెళ్తే వర్ధమాన నటి అమ్ములు (ఛార్మి)కి చిత్తూరుజిల్లాలో అతి భీకర మాంత్రికుడు ముత్తయ్య (ప్రదీప్ రావత్) కుమారుడు చిన్నా (విజయ్‌సాయి) వీరాభిమాని. తండ్రి శకూచిని ఒకరిపై ప్రయోగించి ఇచ్చిన డబ్బుతో కారు కొని దాన్ని అమ్ములుకు ఇవ్వను హైదరాబాద్ వస్తాడు. ఆమెను ఇంటి వద్ద కలసి తన అభిమానాన్ని వెల్లడిస్తుండగా మరొక దురభిమాని ఆమెపై వేయరాని చోట చేయివేస్తాడు. ఈ పని చిన్నానే చేశాడని అమ్ములు డ్రైవర్ సుబ్బు అతడ్ని చావచితక కొడతాడు. ఈ అవమానాన్ని భరించలేక అతను పురుగుల మందు తాగుతాడు. దాన్ని కక్కించను డాక్టర్లు ప్రయత్నించగా అతను అమ్ములు కావాలంటాడు. షూటింగ్‌లో వున్న అమ్ములును ముత్తయ్య కలసి జరిగిన విషయం వెల్లడిస్తాడు. ఆమె తన అభిమానిని చూడాలనుకొన్నా దర్శకుడు షూటింగ్ నుంచి పంపనంటాడు. ఇంతలో చిన్నా చనిపోతాడు. దీన్ని తట్టుకోలేని ముత్తయ్య, అమ్ములుపై 'శకూచి' క్షుద్ర విద్యను ప్రయోగిస్తాడు. దీంతో ఆమె వింతగా ప్రవర్తిస్తుంది. మరో మాంత్రికుడు కాబా ఈ విద్యను ప్రయోగించిన వ్యక్తే అమ్ములును రక్షించగలడని, లేకుంటే మరణమే శరణ్యమంటాడు. డ్రైవర్ సుబ్బు ఆమెను తీసుకొని చిత్తూరు వెళ్లేసరికి శకూచి తిరగబడి ముత్తయ్య ప్రాణం తీసేస్తుంది. తిరిగి వస్తుండగా మార్గమధ్యమంలో ఓ శివసన్యాసిని అమ్ములును చూసి కీకారణ్యంలోని శైవ క్షేత్రానికి తీసుకవెళ్తుంది. అక్కడ సన్యాసులు, శకూచి ఆవహించిన అమ్ములు మధ్య భీకరపోరు జరిగినా అంతిమంగా శివగంగ చిలకరింపుతో అమ్ములు మామూలు మనిషి అవడంతో చిత్రం ముగుస్తుంది.




సినిమాలు లేక అల్లాడుతున్న ఛార్మి మంగళలో అమ్ములుగా మంచి నటన ప్రదర్శించింది. నృత్యాల్లోనే ఆమె భంగిమలు వికారం. మాంత్రికునిగా నటించిన ప్రదీప్‌రావత్‌కు ఇటువంటి పాత్రలు కొట్టిన పిండి. మరో మాంత్రికుడుగా నటించిన యువ నటుడు, డ్రైవర్ సుబ్బుగా నటించిన వర్ధమాన నటుడు నటన ప్రశంసనీయం. రాంజగన్‌కు కూడా చిత్రంలో మంచి పాత్ర లభించింది. భయపెట్టే 'మంగళ' అన్ని వర్గాలను అలరించదని దర్శకుడు తులసీరామ్‌కు తెలియదా?

# కీచక స్కూల్ కరస్పాండెంట్

పాఠాలు చెప్పాల్సిన గురువే విద్యార్థినుల పాలిట కీచకుడిగా మారి చివరకు పెద్దలతో దేహశుద్ధి చేయించుకొన్న ఘటన నగరంలో చోటు చేసుకొంది. పప్పులవీధిలో ఇంగ్లీషు మీడియం స్కూల్‌ను ఇద్దరు యువకులు నిర్వహిస్తున్నారు. వీరిలో ఒక కరస్పాండెంట్ వ్యవహారశైలి భిన్నంగా వుంటోందట. అతిగా వ్యవహరించే ఈ ప్రబుద్ధుడు పాఠశాలకు వచ్చే విద్యార్థినులను లైంగిక వేధింపులకు గురిచేస్తుండేవాడట. చివరకు పాఠశాల వదలి వెళ్లిన బాలికలనూ వదలకుండా వెంటబడి తన కోరిక తీర్చమని బలవంతం చేస్తుండడంతో ఆ అమ్మాయి పెద్దలకు

## పప్పులవీధిలో దేహశుద్ధి చేసిన స్థానికులు

విషయం తెలపడంతో ఆ యువ కరస్పాండెంట్‌కు ఆ అమ్మాయి తరఫు వారు బడితపూజ చేసిన సంగతి కలకలం రేపింది. ఆ అమ్మాయి పెద్దలతోనూ కరస్పాండెంట్ తలతిక్కగా వ్యవహరించడంతో కడుపు మండిన వాళ్లు అతన్ని పట్టుకొని సమీపంలోని రైసు మిల్లులో వేసి దేహశుద్ధి చేశారట. దీంతో నివ్వెరపోయిన ఆ కరస్పాండెంట్ దిగొచ్చి కాళ్ల బేరానికి వచ్చాడట. తప్పు జరిగింది క్షమించమని కాళ్లు పట్టుకోవడంతోపాటు జరిగిన దానికి పెద్ద మొత్తంలో డబ్బులు ముట్టజెప్తానని బేరసారాలు నడుపుతున్నాడు. అమ్మాయి తరఫువాళ్లు పాఠశాలను ఆమె పేర వ్రాసివ్వమని అడుగుతుండడం, దీనికి బదులు లక్షలాది రూపాయలు చెల్లిస్తానని తనను విడిచిపెట్టమని కరస్పాండెంట్ అడుగుతుండడంతో పెద్దలు ఈ వ్యవహారాన్ని బయటపడనీయకుండా చక్కదిద్దుతున్నట్లు సమాచారం.

# డిఇఓ కాలర్ పట్టి లాగిన టీచర్

## దిగజారుతున్న గురువులు

జిల్లా విద్యాశాఖాధికారికి, ఒక సస్పెండ్ అయిన టీచర్‌కు మధ్య జరిగిన వివాదం ముదిరి ఒకరినొకరు కొట్టుకొనే వరకు వెళ్లిన ఘటన విద్యాశాఖలో సంచలనం రేపింది. అంబేద్కర్ ధర్మపోరాట సమితిలో తిరిగే ఒక టీచర్‌ను అధికారులు సస్పెండ్ చేశారు. దీనిపై తనకున్న పలుకుబడిని ఉపయోగించి రాజధాని స్థాయిలో పైరవీలు చేసి సస్పెన్షన్‌ను ఎత్తి వేయించుకొనేందుకు ఆ టీచర్ ప్రయత్నిస్తున్న సందర్భంలో విద్యాశాఖ ఉన్నతాధికారి వ్యవహారశైలితో ఇరువురి మధ్య గత కొంతకాలంగా వివాదం కొనసాగుతోంది. సీనియర్ అసిస్టెంట్ వీరిద్దరి మధ్య మరింత చిచ్చురేపాడట. ఈ నేపథ్యంలో ఇటీవల విద్యాశాఖాధికారిని కలిసేందుకు వెళ్లిన ఆ ఉపాధ్యాయుడికి అధికారి సరిగా సమాధానం చెప్పకపోవడంతో ఆగ్రహించిన టీచర్ ఏకంగా అధికారి కాలర్ పట్టుకోవడంతోపాటు దాడికి ప్రయత్నించడం సంచలనం రేపింది. ఈ హఠాత్ పరిణామంతో బిత్తరపోయిన అధికారి నన్ను కొడుతున్నాడని కేకలు వేయడంతో కార్యాలయ సిబ్బంది వచ్చి ఇరువురిని విడిపించారట. ఇరువురి మధ్య రాజీ చేసేందుకు కొందరు ఉపాధ్యాయులు ప్రయత్నిస్తున్నా దెబ్బలు తిన్న ఆ అధికారి మాత్రం పోలీసులకు ఫిర్యాదు చేయకపోవడంపై పలు రకాల వ్యాఖ్యలు వినవస్తున్నాయి.

# నెల్లూరు ఆర్డీఓపై ఆరోపణలు

జిల్లాలో పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న మండలాల్లో ముత్తుకూరు ప్రధానమైనది. ఈ మండలంలో కృష్ణపట్నం పోర్టుతో పాటు వివిధ పరిశ్రమల నిర్మాణాలు శరవేగంగా జరుగుతున్నాయి. ఈ క్రమంలో భూములకు మంచి డిమాండ్ ఏర్పడింది. పరిశ్రమల కోసం కేటాయించిన భూములకు నష్టపరిహారం అందించడంలో ముత్తుకూరు తహసీల్దార్ పలు అక్రమాలకు పాల్పడ్డారన్న ఆరోపణలు గతంలోనే వచ్చాయి. గ్రామాలలో భూములు కోల్పోయిన వారికి పరిహారం అందించాల్సి వుంటుంది. తహసీల్దార్‌గా బాధ్యతలు చేపట్టిన ఈమె ధనార్జనే ధ్యేయంగా చేసుకొని పని చేస్తుందని ఆందోళనలు కూడా చేపట్టారు. ఈమెపై వచ్చిన ఆరోపణలపై వెంటనే స్పందించి విచారణ చేయాల్సిన నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాలరెడ్డి అండగా నిలుస్తున్నారన్న ప్రచారం సాగుతోంది. పరిశ్రమల ఏర్పాటు కోసం సేకరించిన భూములకు పరిహారం నిర్ణయించడంలో ఆర్డీఓ కీలకపాత్ర పోషిస్తాడు. తహసీల్దార్ సూచించిన వారికే ముందుగా పరిహారం అందించి మిగిలిన వారి గురించి పట్టించుకోవడం మానేస్తున్నారు. ప్రభుత్వ భూములు, డి–ఫారం పట్టా భూములు, అసైన్‌మెంట్



నెల్లూరు ఆర్డీఓలో మార్పు.

భూములకు సంబంధించి రికార్డులు లేకపోయినా వున్నట్టు సృష్టించి అందించే పరిహారంలో వాటాలు తీసుకొంటున్నారని కొందరు గ్రామస్తులే ఆరోపణలు చేస్తున్నారు. తహసీల్దార్ తీసుకొంటున్న అనాలోచిత నిర్ణయాల కారణంగా భూములు కోల్పోయిన చిన్న, సన్నకారు రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. పరిశ్రమల నిర్వాహకులు రెవిన్యూ యంత్రాంగాన్ని ప్రలోభాలకు గురిచేయడం కారణంగా వారికి అనుకూలంగా వ్యవహరిస్తున్నారు.

# ఎమ్మెల్సీ ఓటు ఇలా వేయాలి!

శాసన మండలికి సంబంధించి నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు జిల్లాల పట్టభద్రులు, ఉపాధ్యాయ నియోజకవర్గ ఎన్నికలు ఈ నెల 13న జరుగనున్నాయి. ఈ ఎన్నికల్లో ఓటు వేసేవారు కొన్ని మెలకువలు పాటించాల్సి వుంటుంది. ఈ ఎన్నికల్లో పోటీ చేసే అభ్యర్థుల పేర్లతో కూడిన బ్యాలెట్ పేపర్‌ను ఓటర్లకు ఇస్తారు. ఓటు వేసే వారు బ్యాలెట్ పేపర్‌లో పోటీలో వున్న అభ్యర్థి పేరుకు ఎదురుగా ప్రాధాన్యత ఓటును నమోదు చేయాలి. ఉదాహరణకు

## ప్రాధాన్యత క్రమంలో టిక్కులివ్వాలి

బ్యాలెట్ పేపర్‌లో ఐదుగురు అభ్యర్థుల పేర్లుంటే వీరిలో ముందుగా ఎంపిక చేసుకున్న వారికి ఒకటిగా నమోదు చేస్తే ఓట్ల లెక్కింపులో తొలి ప్రాధాన్యం వుంటుంది. సాధారణ ఎన్నికలలో ఎమ్మెల్యేలుగా ఎంతమంది పోటీ చేసినా ఒకరికే ఓటు వేస్తారు. ఎమ్మెల్సీ ఎన్నికల్లో మాత్రం ఎంతమందికైనా ఓటు వేసే విధానం వుంటుంది. మెజార్టీ ఆధారంగా ఓట్ల లెక్కింపు చేపట్టి ఫలితాలను వెల్లడిస్తారు.

# ఇళ్ల కోసం వినతుల వెల్లువ

- **ఇబ్బందేమీ లేదంటున్న ఇఇ**

సామాన్యులు తమకు ఏదో ఒక ప్రభుత్వ పథకంలో ఇళ్లు కట్టించి ఇవ్వమని ప్రాధేయపడుతున్నారు. జనం ఆకాంక్ష ఇటీవల ముగిసిన రచ్చబండ కార్యక్రమంలో వ్యక్తమయ్యింది. ఈ కార్యక్రమంలో 66వేల మంది తమకు ఇళ్లు లేవని వాటిని కట్టించి ఇవ్వమని వినతులిచ్చినట్లు హౌసింగ్ ఇఇ బివి.నగేష్ చెప్పారు. ఇళ్ల కోసం దరఖాస్తు చేసిన వారి పూర్వాపరాలు పరిశీలించి ఇళ్లను మంజూరు చేస్తామన్నారు. లబ్దిదారులు ఆసక్తి కనపరచక పోవడం వల్ల లక్షకుపైగా ఇళ్లు పెండింగ్ వుండగా 12,450 ఇళ్లను క్రమబద్ధీకరించామన్నారు. జిల్లాలో 280 ఇందిరమ్మ కాలనీలలో డ్రైన్లు, సిమెంటు రోడ్లు, విద్యుత్ పనులకు ప్రతిపాదనలు పంపామన్నారు. ఎస్‌సి, ఎస్‌టిల ఇళ్లకు 54,250 రూపాయలు, బిసిల ఇళ్లకు 34,250 రూపాయలు ప్రభుత్వం ఇస్తుందన్నారు. ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణాలు అనుమతులున్నవారు త్వరితగతిన పూర్తి చేసుకోవాలన్నారు. ఈ ఇళ్లకు సిమెంట్ కొరతతోపాటు బిల్లుల చెల్లింపులోనూ ఆలస్యం లేదన్నారు.



శాసన మండలికి నెల్లూరు స్థానిక సంస్థల నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా నామినేషన్ దాఖలు చేస్తున్న వాకాటి నారాయణరెడ్డి. ప్రక్కన మాదాసు గంగాధరం, చాట్ల నరసింహారావు, నేదురుమల్లి రాజ్యలక్ష్మి, పనబాక కృష్ణయ్య.



శాసన మండలికి నెల్లూరు స్థానిక సంస్థల స్థానం నుంచి వైఎస్ జగన్ మద్దతుదారునిగా నామినేషన్ వేస్తున్న రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి. ప్రక్కన జడ్పీటీసీలు వీరి చలపతి, గోగుల వెంకయ్య, డిసిసి మాజీ సారథి ఎల్లసిరి గోపాలరెడ్డి.



శాసన మండలికి నెల్లూరు స్థానిక సంస్థల స్థానం నుంచి తెలుగుదేశం అభ్యర్థిగా నామినేషన్ దాఖలుచేస్తున్న బీద రవిచంద్ర. ప్రక్కన వై.గోవర్ధన్‌రెడ్డి, ఎమ్మెల్యే పరసా రత్నం, నారపరెడ్డి తదితరులు.



కమ్యూనిస్ట్, అర్బన్ బ్యాంక్ అధ్యక్షుడు స్వర్గీయ అరిగెల సుబ్బరామయ్య మనుమరాలు, అడ్వకేట్ విజయకుమార్ కుమార్తె విద్య, ప్రణేశ్‌ల వివాహం ఫిబ్రవరి 16వ తేది నెల్లూరులో జరిగింది.

## ఓటుకు లక్ష

మొదటి పేజీ కొరవ

న్నాయి. ఆ ఖర్చు తడిసి మోపెడై, ఓటు విలువకంటే ఎక్కువయ్యేట్లుంది.

గెలుపు ఓటముల పరిస్థితి చూస్తే, వాకాటి నారాయణరెడ్డి నక్కతోక తొక్కినట్లు కన్పిస్తున్నది. ఆనం, నేదురుమల్లి, ఆదాల త్రయం మనసుపెట్టి పని చేయడమే ఆయన అదృష్టం. దానితో జిల్లా మొత్తం మీద కాంగ్రెస్ ఓట్లను సమీకరించడం సులువౌతున్నది. ఆనం రామనారాయణరెడ్డి గల్లాపెట్టె మంత్రి కావడం మరికొంత అనుకూలం. ఆయనతో పేచీ పెట్టుకొంటే బ్రతకడం కష్టమన్న భయంతో మండల స్థాయి నాయకులు బుద్ధిగా, ఒళ్లు దగ్గర పెట్టుకొని పని చేస్తున్నారు.

జగన్ అభ్యర్థి బాగా వెనుకపడడానికి కారణం అదే. ఇంతకాలం జగన్ శిబిరంలో చేరినవారంతా కాంగ్రెస్‌వాదులే. తెలుగుదేశం నుంచి, ఒక్క నల్లప రెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తప్ప చెప్పుకోదగిన నేతలెవ్వరూ వెళ్లలేదు. రామనారాయణరెడ్డి అధికార భయం ఆ శిబిరానికి మారిన మండలస్థాయి కాంగ్రెస్ వాదులకు స్పీడ్ బ్రేకర్ వలె పని చేస్తున్నది. ఓటర్ల మీద తమ పలుకుబడి ప్రయోగించడానికి జంకుతున్నారు వారు.

దీనితో కోవూరు, కావలి, ఉదయగిరి నియోజకవర్గాలలో మాత్రమే జగన్ అభ్యర్థి తమ వునికి కాపాడుకోగల్గుతున్నారు. సూళ్లూరుపేట, గూడూరు, సర్వేపల్లి, నెల్లూరు రూరల్, ఆత్మకూరు, వెంకటగిరి నియోజకవర్గాలలో వారికి పాదం మోపే అవకాశం లభించడం లేదు. మూడు నియోజకవర్గాలలో పరిస్థితి మెరుగ్గా వుంది, ఆరు నియోజకవర్గాలలో వెనుకపడితే, ఫలితం ఎట్లా వుంటుందో వివరించి చెప్పనవసరం లేదు కదా?

పిట్ట పోరు పిట్ట పోరు పిల్లి తీర్చినట్లు, ఇద్దరు బంగారు పిచుకల మధ్య సమరంలో బీద అరుపులు మాత్రమే విన్పిస్తున్న బీద రవిచంద్ర కుదురుగా నిలదొక్కుకోగల్గుతున్నాడు. ఒకరకంగా చెప్పాలంటే ఇప్పుడు పోట అనేది కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల మధ్యనే వుంది తప్ప, జగన్ అభ్యర్థి వారితో సమానంగా నిలవలేక పోతున్నాడు.

ఒక అంచనా ప్రకారం కాంగ్రెస్ అభ్యర్థి 250 నుంచి 270 ఓట్ల వరకు తెచ్చుకోగలడని, తెలుగుదేశం అభ్యర్థి 210 నుంచి 230 వరకు చేరుకొంటున్నాడని, జగన్ అభ్యర్థి 100 నుంచి 130 మధ్యలో నిలిచి పోతాడని చెప్తున్నారు. ఈ ఎన్నికలలో ఒక్కొక్క అభ్యర్థి ఓటుకు లక్ష నుంచి రెండు లక్షల వరకు ఖర్చు పెడుతున్నప్పటికీ, కేవలం డబ్బు ప్రభావంతో ఓట్లు పడే పరిస్థితి కన్పించడం లేదు. ఓటర్లు ఇద్దరి దగ్గరా, కొన్ని సందర్భాలలో ముగ్గురి దగ్గరా డబ్బు తీసుకోవడం అందుకొక కారణం. ఏ ఒక్కరి దగ్గరో డబ్బు తీసుకొని వుంటే, ఆ కృతజ్ఞతతో ఓటు చేస్తారు. అందరి దగ్గరా తీసుకొన్నప్పుడు ఇక డబ్బు ప్రాధాన్యత ఏమి వుంటుంది? పోలింగ్ బూతులోకి వెళ్లిన తర్వాత ఓటరు మనసులో ఎవరు మెదిలితే వారికే ఓటు దక్కుతుందన్నది నిజం. స్థానిక రాజకీయ అవసరాలు, పార్టీ అనుబంధాలు, నేతలతో మొగమాటాలు, అధికార భయాలు, అభ్యర్థుల పట్ల వ్యక్తిగత ఇష్టా అయిష్టాలు వంటి కారణాలతో పోలింగ్ జరగబోతున్నది. ఆ అంశాలలో తతిమా ఇద్దరి కంటే, కాంగ్రెస్ అభ్యర్థి వాకాటి నారాయణరెడ్డి మెరుగ్గా కన్పిస్తున్నాడు. అందువల్ల ఆయన గెలుపుకే అవకాశం ఎక్కువ.

తమకు, తెలుగుదేశానికి మాత్రమే పోటీ అనే పరిస్థితి స్పష్టం కావడంతో, కాంగ్రెస్ నాయకులు తెలుగుదేశం ఓటర్ల మీద ఎక్కడలేని దృష్టి పెడుతున్నారు. ప్రతి ఓటరుకూ గాలం వేస్తున్నారు. ప్రలోభాలు పెడుతున్నారు. ఒత్తిడులు పెంచుతున్నారు. తెలుగుదేశం ఓట్లను ఎంతగా తగ్గించగల్గితే తమ విజయం అంత సులభం అన్నది వారి వ్యూహం. దీన్ని ఢీకొనే సామర్థ్యం తెలుగుదేశంలో కన్పించడం లేదు. ఒక్క సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి తప్ప, తతిమా జిల్లా తెలుగుదేశం నేతలెవ్వరూ ఈ ఎన్నిక పట్ల మనసు పెట్టి పని చేయడం లేదు. తమ తమ పరిధులలో తమ ఓటర్లను కాంగ్రెస్, జగన్ అభ్యర్థులు వశపరచుకొంటున్న సంఘటనలను వారు చాలా ఉదాసీనంగా వదిలేస్తున్నారు. తమ ఓటర్లను కాపాడుకొనే ప్రయత్నం ఎంత మాత్రం చేయడం లేదు. వాకాటి నారాయణరెడ్డి అనుకూలతలలో అదీ ఒక ముఖ్యమైనదే. చివరి నిముషంలో వూహించని మార్పులేమైనా జరిగితే చెప్పలేము.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### జడ్పీ ఛైర్మన్‌పై అయ్యోరి ఫిర్యాదులు!

నెల్లూరు నగర కాంగ్రెస్ అధ్యక్షుడు చాట్ల నరసింహారావు జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిపై ఎన్నికల కమిషన్‌కు ఫిర్యాదు చేశారు. స్థానిక సంస్థల షెడ్యూల్ ప్రకటించాక గోవర్ధన్‌రెడ్డి రైతులకు గిట్టుబాటు ధర అంశంపై అధికారుల సమీక్షతోపాటు రేబాలవారి వీధిలోని చిన్నపిల్లల ఆసుపత్రిని సందర్శించి సలహాలిచ్చారని ఇది కోడ్ ఉల్లంఘన అని, ఈ సమావేశాలు, సందర్శనల వల్ల జగన్ వర్గం అభ్యర్థికి మేలు జరుగుతుందని తన ఫిర్యాదులో అయ్యోరు పేర్కొన్నారు.

### ఏకెనగర్ పోస్టాఫీసులో రైల్వే రిజర్వేషన్ కౌంటర్

నెల్లూరు ఏకెనగర్ పోస్టాఫీసులో రైల్వే ప్యాసెంజర్ రిజర్వేషన్ కౌంటరును ప్రారంభించామని ఇక్కడి నుంచి దేశంలో ఏ ప్రాంతానికైనా వినియోగదారులు రైలు టిక్కెట్ రిజర్వేషన్ చేసుకోవచ్చని పోస్టల్ సూపరింటెండెంట్ ఒక ప్రకటనలో స్పష్టం చేశారు.

### ముదిగొండకు పదవి

నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి అభిమాన సంఘ నేతగా అందరికీ పరిచితుడైన ముదిగొండ శ్రీనివాసులును మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి రాష్ట్ర గౌరవ సలహాదారునిగా, ప్రత్యేక ఆహ్వానితునిగా మందా కృష్ణమాదిగ నియమించారు. శ్రీనివాసులు వైశ్యుడైనా చేసిన, చేస్తున్న సేవా కార్యక్రమాల దృష్ట్యా మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి ఆయన్ను ఈ విధంగా గౌరవించింది.

### యశోదమ్మ మరణం

పార్లపల్లి కరణంగా సుప్రసిద్ధుడైన స్వర్గీయ పార్లపల్లి రమణయ్య సతీమణి, పబ్లిక్ హెల్త్ చీఫ్ ఇంజనీర్‌గా రిటైర్ అయిన పార్లపల్లి సుధాకర్‌రావు తల్లి శ్రీమతి యశోదమ్మ 9తేది నెల్లూరులో మరణించారు. ఆమె వయస్సు 83 సంవత్సరాలు. ఆమెకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె వున్నారు. వారి కుటుంబానికి మా సానుభూతి.

## అధికార పార్టీ నేతలు

9వ పేజీ కొరవ

నిల్వ కాకుండా చూసుకోవడం జాయింట్ కలెక్టర్ స్థాయిలో జరిగే పని. ఎఫ్‌సిఐ స్థానిక అధికారులను పిలిపించి, గట్టిగా హెచ్చరిక చేస్తే చాలు. కానీ మన కలెక్టర్‌కి కానీ, జాయింట్ కలెక్టర్‌కి కానీ ప్రజలకు ఉపయోగపడే పనులంటే ఎక్కడలేని అనాశక్తి. వారి సమయమంతా కృష్ణపట్నం పోర్టుకు ఇంకెన్ని వేల ఎకరాల భూమి స్వాధీనం చేసి పెడదామా అన్న దానిపైనే వుంటుంది. రోజంతా ఆ పని మీద బిజీగా వుండి పోతున్నారు వీరిద్దరూ. పోర్టు అధికారులు, గుమస్తాలు వారి గదులలోనే కాపురాలు చేస్తున్నారు. ఒక్క జిల్లా నుంచి మరొక జిల్లాకు బియ్యం సరఫరా చేయాలంటే, స్థానిక ఎఫ్‌సిఐ జిల్లా అధికారి అనుమతి అవసరం. మన వ్యవసాయ సీజన్ సమయంలో ఇతర జిల్లాలు లేదా ప్రాంతాల నుంచి రవాణాకు వచ్చే విజ్ఞప్తులను స్థానిక ఎఫ్‌సిఐ అధికారి తిరస్కరించవచ్చు. కానీ అది జరగడం లేదు. మనకంటే ముందు గోదావరి జిల్లాల వారు బియ్యం నిల్వ చేసుకోవడానికి అనుమతి ఇస్తున్నారు. దాన్ని ఆపలేక పోవడం రెవెన్యూ అధికారుల అసమర్థత తప్ప వేరేమీ కాదు. కలెక్టర్, జాయింట్ కలెక్టర్లు తలచుకొంటే, గట్టిగా శ్రద్ధ పెట్టి పని చేస్తే, రైతుకు పుట్టికి కనీసం వెయ్యి రూపాయల అదనపు ధర లభిస్తుంది, ఇప్పటి పరిస్థితులలో. ఆ మాత్రం కూడా వారిలో రైతుల పట్ల శ్రద్ధ లేకపోవడం మన దౌర్భాగ్యం.

### పర్మిట్లు ఎందుకివ్వరు?

బుడ్డలనే పిలవబడే రకం వడ్లకు నెల్లూరు జిల్లాలో గిరాకీ లేదు. ఇక్కడి ఎఫ్‌సిఐ కూడా దాన్ని తీసుకోదు. కానీ ఆ బియ్యానికి తమిళనాడు, కేరళ వంటి రాష్ట్రాలలో గిరాకీ వుంది. అయితే వాటిని అక్కడకు పంపాలంటే, రవాణా పర్మిట్ కావాలి. వాటిని సకాలంలో జారీ చేస్తే, వడ్లకు గిరాకీ పెరుగుతుంది. రైతుకు మేలు జరుగుతుంది. అందుకు అధికారులు చేయవలసిందల్లా, రాష్ట్ర సివిల్ సప్లయిస్ కమిషనర్‌కు ముందుగా పరిస్థితి వివరించి, పర్మిట్లు ఇవ్వడానికి అనుమతి తెచ్చుకోవడం మాత్రమే. కానీ మన జాయింట్ కలెక్టర్ గారికి ఆ మాత్రం తీరిక కూడా లేదు. ఆయనకున్న పుణ్యకాలమంతా ఎస్ఇజడ్ భూసేకరణకే సరిపోతున్నది. ఆ వ్యవహారంలో వచ్చే గిట్టుబాటు, రైతులకు మేలు చేస్తే రాదు కదా మరి?

### సోమిరెడ్డి ఒక్కడే చొరవ చూపాడు

ధాన్యం ధరల పతనంపై సోమిరెడ్డి చొరవ చూపాడు. అన్ని రాజకీయ పక్షాలను కలుపుకొని, ధర్నాలు, ఆందోళనలు చేస్తున్నాడు. ఆయన అల్లరితో జిల్లా అధికారులలో కొంత కదలిక వచ్చింది. బుడ్డల రకం వడ్ల రవాణాకు ప్రభుత్వం నుంచి అనుమతి తీసుకొని, పర్మిట్లు ఇచ్చే ఏర్పాట్లు చేస్తున్నారు. జిల్లా కాంగ్రెస్‌వాదులలో ఏ ఒక్క నాయకుడు కూడా రైతు బ్రతుకును ఛిద్రం చేస్తున్న ధరల సమస్యలపై స్పందన చూపకపోవడం విచారకరం. ఆర్థికమంత్రిగా వున్న ఆనం రామనారాయణరెడ్డి ఏ మాత్రం ఆసక్తి చూపి వుండినా ప్రభుత్వ స్థాయిలో కదలిక వచ్చి, ఈ సమస్య ఇప్పటికే పరిష్కారమై వుండేది. కానీ ఆయనకు అటువంటి విషయాలు ఎప్పుడూ పట్టవు. తతిమా కాంగ్రెస్ నేతలు కూడా అంతే.

## పట్టభద్రులలో తెలుగుదేశం - ఉపాధ్యాయులలో కమ్యూనిస్టులు!

ఉపాధ్యాయుల నియోజకవర్గంలో షరా మామూలే అన్నట్లుంది పరిస్థితి. ఉపాధ్యాయ సంఘాలలో గట్టిపట్టు వున్న యుటిఎఫ్ అభ్యర్థి విఠపు బాలసుబ్రహ్మణ్యం గెలుపు నల్లేరు మీద నడకగా జరిగి పోవచ్చునని చెప్తున్నారు. వారి సంఘంలో పాతిక వేలకు పైగా టీచర్లున్నారని అంచనా. ఆ స్థాయిలో సభ్యులున్న టీచర్ల సంఘం వేరొకటి లేదు. అందువల్ల గెలుపు వారికే అనుకూలం కాబోతుంది.

సాధారణంగా అయితే పట్టభద్రులలో కూడా ఈ పాతికవేల ఓట్ల బలమే కమ్యూనిస్టులను కాపాడాలి. ఆ బలంతోనే గత ఎన్నికలలో విఠపు బాలసుబ్రహ్మణ్యం గెలిచాడు. అయితే ఈసారి ఆ పరిస్థితిలో మార్పు వచ్చేట్లుంది. కమ్యూనిస్టులు శాసనమండలికి నిలబెట్టే అభ్యర్థుల వ్యక్తిత్వం వున్నతమైనది. మచ్చలేని జీవితాలను గడిపిన వారినే ముందుకు తెస్తున్నారు వారు. అయితే వారి గెలుపు యుటిఎఫ్ ఉపాధ్యాయ సంఘం ఓట్ల బలంతో మాత్రమే సిద్ధిస్తున్నందువల్ల, శాసనమండలి సభ్యులుగా వారి పరిధి కూడా ఆ మేరకే పరిమితమై పోతున్నది. తమ సంఘం సమస్యల మీద ప్రజాసంబంధిత అంశాలు వేటిలోనూ వీరు చొరవ చూపడం లేదు. చాలా సంకుచితంగా వ్యవహరిస్తున్నారు. అందువల్లనే అటు పట్టభద్రుల నుంచి కానీ, ఇటు ఉపాధ్యాయుల నుంచి కానీ గెలిచిన ఎమ్మెల్సీలకు ప్రజల గుర్తింపు, గౌరవం దక్కడం లేదు. వారికి ఓట్లు వేసే దండగ అనే భావం యుటిఎఫ్‌కు అనుబంధితం కాని ఉపాధ్యాయులు, పట్టభద్రులలో స్పష్టంగా కన్పిస్తున్నది. ప్రైవేటు స్కూల్ అయ్యవార్లు, యాజమాన్యాలు ఈ విషయంలో చాలా ఆందోళనగా వున్నాయి. తమను దోపిడీదారులుగా చూసేవారిని వారెంత వుత్తములైనప్పటికి గెలిపించుకోవడం కంటే తమ సమస్యల పట్ల సానుకూల దృక్పథం గలవారిని ఎన్నుకోవడం మేలనే భావన కల్గుతున్నది.

ఆ భావన వల్ల ప్రధానంగా లబ్ది పొందుతున్నవాడు, తెలుగుదేశం పట్టభద్రుల అభ్యర్థి దేశాయిశెట్టి హనుమంతరావు.

హనుమంతరావు న్యాయవాదిగా మంచి పేరు తెచ్చుకొన్నవాడు. తెలుగుదేశం పార్టీ కోసం తన ఇళ్లు ఒళ్లు గుల్ల చేసుకొని మరీ పని చేసే సుశిక్షిత కార్యకర్త. చంద్రబాబు నాయుడుకు నమ్మకస్తుడు, చంద్రమోహన్‌రెడ్డి అభిమానం పొందిన వాడు. వ్యక్తిగా వున్నత సంస్కారి. ఈ అనుకూలతల వల్ల తెలుగుదేశం పార్టీలో అందరూ ఆయన గెలుపు కోసం పని చేస్తున్నారు. మరొకప్రక్క కాంగ్రెస్ అభ్యర్థి రంగంలో లేకపోవడం, బిజెపి పోటీ నామకార్థం కావడంతో, కమ్యూనిస్టేతర ఓట్లన్నీ హనుమంతరావుకు పడే అవకాశం కన్పిస్తున్నది. దానితో పోటీలో గెలుపుకు చాలా దగ్గరగా వచ్చి వున్నాడు హనుమంతరావు.

• సర్కారీ

# అంతర్జాతీయ మహిళా దినోత్సవం!

## పేలవంగా సభ



*అంతర్జాతీయ మహిళా దినోత్సవంలో మహిళల హక్కు కాపాడుతామని కళాక్షేత్రంలో సభికుల చేత ప్రమాణం చేయిస్తున్న అదనపు జెసి సీతారామయ్య.*

ఈ నెల 8వ తేదిన నగరంలోని కస్తూర్బా కళాక్షేత్రంలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా స్త్రీ, శిశు సంక్షేమశాఖ ఆధ్వర్యంలో కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమ ప్రారంభోత్సవ సందర్భంగా జెండాను ఆవిష్కరించడం జరిగింది. జెండా ఏర్పాటు చేసే విషయంలో నిర్వాహకులు సరైన జాగ్రత్తలు తీసుకోవడంలో పూర్తిగా విఫలం చెందినట్లు కనిపించింది. జెండాకు కట్టిన తాడును లాగిన సమయంలో జెండాపైకి ఎగిరి కిందపడిపోయింది. ఇలా జరగడం వలన అదనపు జెసి సీతారామయ్య కొంత అసహనానికి గురైనారు. అధికారులను పైకి ఏమి అనక పోయినా ఆయన కళ్లల్లో మాత్రం ఆగ్రహం స్పష్టంగా కనిపించింది. కళాక్షేత్రం ఆవరణంలో జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య, నగర డిఎస్పీ రాధిక, ఐసిడిఎస్ పిడి శారద, రాజీవ్ విద్యామిషన్ ప్రాజెక్టు అధికారి తదితరులు ఈ కార్యక్రమానికి హాజరైనారు.

ప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్వహించే మహిళా దినోత్సవ కార్యక్రమంలో స్త్రీ, శిశు సంక్షేమశాఖ అధికారులు, సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరించడంపై ఈ కార్యక్రమానికి హాజరైన ఇతర శాఖలకు చెందిన అధికారులు చర్చించుకోవడం విశేషం. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ఈ శాఖ ఆధ్వర్యంలో గ్రామీణ ప్రాంతాల్లోని అంగన్‌వాడి వర్కర్లను అధికసంఖ్యలో తీసుకవచ్చారు.

వేదికపై కిశోర బాలికలకు అవగాహన సదస్సు అని తెలిపే పెద్ద బ్యానర్‌ను ఏర్పాటు చేసినప్పటికి కొంతమంది బాలికలను మాత్రమే ఇక్కడకు తీసుకురాగలిగారు. జిల్లా నలుమూలల నుంచి అంగన్‌వాడి వర్కర్లను రప్పించడం వలన కూర్చొనేందుకు సీట్లు లేక అనేక మంది బయట వరండాలోనే వేచి వుండాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఉదయం 10 గంటలకు సమావేశం వుందని అందరూ తప్పకుండా హాజరుకావాలని ఆదేశాలందడంతో వ్యయప్రయాసల కోర్చి ఈ కార్యక్రమానికి హాజరైనారు. ముందుగా నిర్ణయించిన సమయం కంటే గంటన్నర ఆలస్యంగా కార్యక్రమాన్ని ప్రారంభించారు. దూర ప్రాంతాల నుంచి ముందుగా వచ్చిన అంగన్‌వాడి వర్కర్లు కొందరు ఇంటి దారి పట్టారు.

### తూతూ మంత్రంగా ఉపన్యాసాలు

అంతర్జాతీయ మహిళాదినోత్సవాన్ని పురస్కరించుకొని ఏర్పాటు చేసిన కార్యక్రమానికి హాజరైన పలువురు అధికారులు మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలు, పరిష్కార మార్గాల గురించి స్పష్టంగా ఆహూతులకు వివరించలేకపోయారు. మహిళా దినోత్సవం వుద్దేశం ఏమిటి? స్త్రీ, శిశు సంక్షేమశాఖ ఆధ్వర్యంలో మహిళల కోసం చేపడుతున్న కార్యక్రమాలు ఏమిటన్నది ఈ శాఖ అధికారులు వెల్లడించలేకపోయారు. వేదికపై వున్న వివిధ స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు ఆహ్వానిస్తే వచ్చాం అనే విధంగా నాలుగు మాటలు మాట్లాడి సరిపెట్టుకున్నారు. ఐసిడిఎస్ పిడి శారద మాత్రం కాగితంపై రాసుకొచ్చిన పథకాల గురించి చదివి కార్యక్రమం ఇంతే అన్న విధంగా సరిపెట్టారు.

అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య మహిళలు అన్ని రంగాల్లో చైతన్యవంతులై అభివృద్ధి బాటలో పయనించాలని అభిప్రాయపడ్డారు. నగర డిఎస్పీ రాధిక మహిళల కోసం ఏర్పాటు చేసిన చట్టాల గురించి వివరించారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నిర్వహించిన కార్యక్రమానికి అంగన్‌వాడి వర్కర్లు తరలిరావడంతో ఆయా ప్రాంతాల్లో ఐసిడిఎస్ కేంద్రాలు మూత వేయాల్సి వచ్చింది.

# బాపును వదలి రమణ ఎలా వెళ్లగలిగాడు!

*రమణ ఓ విలక్షణ మనస్తత్వం కలిగిన వ్యక్తి. ఆయన సంస్కారయుత జీవితం, ఆరోగ్యకరమైన రచనా సంధానం వెనుక బాల్యంలో అనుభవించిన దారిద్ర్యం, కన్నీళ్లు, బాధలు, ఒత్తిడులు, ఆర్థిక సంక్షోభాలు వున్నాయి.*



నేను మద్రాసులో ఆచార్య ఆత్రేయ వద్ద పని చేస్తున్న రోజులు. 1971–73 మధ్య ముళ్లపూడి గారిని ఇంటి దగ్గర కలిశాము. మిత భాషి, నిక్కచ్చితనం, ఆత్మాభిమానం, మౌనం ఇవి చూశాక ముళ్లపూడిని ఎలా అర్థం చేసుకోవాలో తెలియలేదు. అలాంటి ముక్తసరి మనిషి ఓ రోజు మైలాపూర్‌లోని ఆత్రేయ గారింటికి వచ్చి ఆయన పాటల్లోని లాలిత్యం, పదప్రయోగం, అక్షర పదాల తీరును గుక్క తిప్పుకోకుండా పొగిడేయటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆయన వెళ్లాక నేను ఆత్రేయ గారిని అదే మాట అడిగేశాను. గొప్పవాళ్లలాగే వుంటారు అన్నారు ఆత్రేయ నవ్వుతూ. ఈ మనిషే ఆంధ్రపత్రికలో పనిచేస్తున్నప్పుడు కొన్ని సినిమాల్ని కొందరు నటుల్ని దుమ్ము దులిపేశాడు. నచ్చిన వాళ్లింటికి వెళ్లి అభినందించి మరీ వచ్చాడు అన్నారు ఆత్రేయ కిళ్లీ నములుతూ. మద్రాసులోనే ఓ సారి సినిమా రచయితల సంఘం వార్షికోత్సవంలో కొందరు సినిమా రచయితలు మాపై ముళ్లపూడి రచనల ప్రభావం వున్నదని గొప్పగా చెప్పుకున్నారు. భేషజాలకు నెలవై, ముసుగులు కప్పుకుని తప్పుకు తిరిగే సినీ పరిశ్రమ రచయితలపై ముళ్లపూడి ఎంతటి ప్రభావాన్ని చూపారో ఈ మాటలే సాక్ష్యం.

1945లో ముళ్లపూడికి బాపుతో స్నేహం కుదిరింది. 1962లో 'రక్తసంబంధం' సినిమాతో సినీ కేరీర్ ప్రారంభమయింది. బాపుతో ముడిపడిన స్నేహం 80 ఏళ్ల వయసులో చనిపోయేంత వరకూ కూడా చెక్కు చెదరలేదు. ముళ్లపూడి రచనలకు బాపు బొమ్మలు వేస్తే బాపు బొమ్మలకు ముళ్లపూడి కథలు రాశారు. ఇద్దరిదీ ఇద్దరు మిత్రులు, ఆప్తమిత్రులు, విడిపోని మిత్రుల బంధం. 1945లో 'బాల' పత్రికలో 'తొలికథ' అమ్మ మాట వినకపోతే అచ్చయింది. 1954లో ఆంధ్ర పత్రికలో సబ్ ఎడిటర్ ఉద్యోగంలో చేరారు. అప్పుడే 1956–57 మధ్య 'బుడుగు'ను సృష్టించి విభిన్నమైన హాస్య ధోరణి ఒరవడిని సృష్టించారు. గిరీశం ఒరవడితో లెక్చరర్లు సృష్టించినా, లావుపాటి భార్య, సన్నపాటి మొగుడు పాత్రలు సృష్టించినా, సినిమా కథలు, మాటలు రాసినా ఆయనదో ప్రత్యేకమైన దృష్టి. ఆ దృష్టితో హాస్యచతురతతో పాత్రల్ని సృష్టించి వాటికి సజీవత్వాన్ని ఏర్పాటు చేశారు. మనిషిలోని నిర్ద్వత, మాటల్లోని పొదుపు అతన్ని కొందరు గర్విష్టివాడని ప్రచారం చేసినా, ఆ గర్వం అతని గుండె ధైర్యం అని కితాబిచ్చింది భానుమతీ రామకృష్ణ. ఆమె కూడా అట్లాంటిదే కదా మరి!?

ముళ్లపూడి అసలు పేరు ముళ్లపూడి వేంకటరావు. బాపు సాహచర్యంతో ముళ్లపూడి వేంకటరమణ అయ్యారు. రాధాగోపాళం, సీతాకళ్యాణం, జనతా ఎక్స్‌ప్రెస్, 'భగ్నవీణలు, బాష్పకణాలు', కథా సంపుటల్ని అచ్చు వేశారు.

ఇక సినిమాల విషయానికొస్తే అందాల రాముడు, ముత్యాలముగ్గు, మిస్టర్ పెళ్లాం, సంపూర్ణ రామాయణం, బుద్ధిమంతుడు లాంటి సినిమాలకు సంభాషణల కర్తగా తెలుగు ప్రేక్షకుల గుండెల్లో స్థిర స్థాయిగా నిలిచిపోయారు ముళ్లపూడి. తెలుగు సాహిత్యానికి, తెలుగు సినిమాలకు ఎంతో సేవ చేసిన ముళ్లపూడిని తెలుగు విశ్వవిద్యాలయం 1992 సంవత్సరంలో గౌరవ డాక్టరేట్‌తో సత్కరించింది. బిరుదులు, సత్కారాలు, సన్మానాలు అలంకరించినా తనను ముళ్లపూడి రమణనే చెప్పుకొన్నాడు. ప్రజలు మాత్రం బాపూ రమణగా చెప్పుకున్నారు. ఆరోగ్యకరమైన హాస్యాన్ని ఇటు అటు తెలుగు సినిమాల్లోనూ సృష్టించిన ముళ్లపూడికి తెలుగన్నా, తెలుగు పల్లెసీమలన్నా ఎంతో ఇష్టం. అందుకనే తెలుగు భాష ఔన్నత్యాన్ని, పల్లె ప్రకృతి జనజీవన సౌందర్యాన్ని ముళ్లపూడి తన సాహిత్యంతో ప్రతిఫలించేలా చేశాడు.

### పాయసం సుబ్రహ్మణ్య మహర్షి

ముళ్లపూడిలోని నిక్కచ్చితనం, సంస్కారం సినీ పరిశ్రమలోని వాళ్లకంతా తెలుసు. ఒక మాట పడని తత్వం అతనిది. అనుకొన్న సమయానికన్నా ముందుగానే స్క్రిప్టులు ఆయా నిర్మాతలకందజేసే వాడు. పంక్చువాలిటీని ఖచ్చితంగా పాటించే వాడు. తాను తీసిన సినిమాల్లోగానీ, వ్యక్తిగతంగాగానీ బాకీ వున్నట్లయితే స్వయంగా ఇంటికి వెళ్లి ఇచ్చి వచ్చేవారు. ఇలాంటి విషయాలు చాలా మందితోబాటు 'వాణిశ్రీ' గారికి కూడా తెలుసు. సాహిత్యంలో వర్ధమాన రచయితల్ని స్వయంగా ఇంటికి వెళ్లి అభినందించి వచ్చిన సంఘటనలు కోకొల్లలు. ఆయన తత్వం ఓ విలక్షణ మనస్తత్వం. రమణ సంస్కారయుత జీవితం, ఆరోగ్యకరమైన రచనా సంధానం వెనుక బాల్యంలో అనుభవించిన దారిద్ర్యం, కన్నీళ్లు, బాధలు, ఒత్తిడులు, ఆర్థిక సంక్షోభాలున్నాయి. ఆ కష్టాల కడలి అలల తాకిడి తగిలి తగిలి ముళ్లపూడి రాటుదేలి పోయాడు. భానుమతి గారు అన్నట్లుగా అతనిలో కనిపించే అతిశయం, గర్వం, నిజంగా అతని గుండె ధైర్యమే. ఆ ధైర్యమే అతన్ని ఇమడలేని సినిమా రంగంలో శ్రీ కృష్ణుడు లాంటి 'బాపు'తో కలసి దూసుకపోయేలా చేసింది. ముళ్లపూడి ధవళేశ్వరంలో 1931 జూన్ 28వ తేదీన జన్మించారు. 14 సంవత్సరాల వయసులో కథా రచన ప్రారంభించారు. అటు బాపు గారినీ ఇటు మనల్నీ వదలి 80 సంవత్సరాల వయసులో 'తనదైన' రీతిలో 'మహాప్రస్థాన' సీమకు తరలి వెళ్లిపోయారు.

ముళ్లపూడి లాంటి ప్రతిభావంతులు కారణ జన్ములు. తెలుగు భాషామతల్లికి అక్షరాభిషేకం చేయాలనే సంకల్పంతో పుట్టి, పెరిగి ఋణం తీర్చుకొని వెళ్లిపోయారు. అయితే నాదొకటే అనుమానం. విడదీయరాని జంటగా వున్న బాపును వదలి ముళ్ల పూడి ఎలా వెళ్లగలిగారు? ఎలా మనసొప్పింది?

(ముళ్లపూడికి అక్షర నీరాజనాలు. వారి కుటుంబ సభ్యులకు తెలుగు రచయితల తరపున నా సానుభూతి).

# జనం కోరిన జగన్ అభిమాని రామిరెడ్డి ప్రతాప్ ను దీవించండి

నెల్లూరు జిల్లా స్థానిక సంస్థల నుండి శాసన మండలికి ప్రతినిధిగా పోటీలో వున్న జగన్ అభిమాని, నిష్కళంకుడు, యువకుడు, రాజకీయాలలో కుట్రలు, కుతంత్రాలు తెలియని సచ్చరిత్రుడు, విద్యా వేత్త శ్రీ రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ని ఆశీర్వదించాల్సిందిగా ప్రజలను, ఓటర్లైన M.P.T.C. లను, Z.P.T.C. లను కోరుతున్నాము. దివంగత మహానేత డాక్టర్ వై.యస్. రాజశేఖర్‌రెడ్డి ని అభిమానించి, ఆరాధించే జిల్లా నేతలు, అభిమానులు కలిసి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ని శాసన మండలికి అభ్యర్థిగా ప్రతిపాదించారు.

నాయకులు ప్రజల నుంచే రావాలన్న మహానేత వై.యస్. పిలుపుకు రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి గెలుపు ఒక మలుపు కాగలదు. స్థానిక సంస్థల వ్యవస్థను బలోపేతం చేసి ప్రతి పల్లెను కన్నతల్లిలా ప్రేమించి అభివృద్ధి చేసిన మహనీయుడు దివంగత నేత డాక్టర్ వై.యస్. రాజశేఖర్‌రెడ్డి. ఆ మహనీయుడి మరణం ఈ రాష్ట్రాన్ని ఎంతగా కదిలించిందో, కలచివేసిందో ఈ రాష్ట్ర అభివృద్ధిని ఎంత సంక్షోభంలోకి నెట్టి సంక్షుభితం చేసిందో చెప్పనవసరం లేదు. ఆ మహనీయుడి పాలన మళ్ళీ రావాలన్నా ఈ రాష్ట్రంలో ఆగిపోయిన అభివృద్ధి సంక్షేమ పథకాలకు మళ్ళీ స్వీకారం చుట్టాలన్నా వై.యస్. లాంటి జగన్ పాలన రావాలి. జనం పాలన రావాలి.

అందుకు ...

ఈ ఎన్నికలే నాంది కావాలి. మీ ఓటు పాశుపతాస్త్రమై నమ్మకద్రోహుల్ని, విశ్వాస ఘాతకుల్ని చీల్చి చెండాడాలి.

దాని కొకటే మార్గం ..

ఆత్మ ప్రబోధం .. కృతజ్ఞతాభావం .. రాజన్న రుణం తీర్చుకునే మహద్భాగ్యం ఇదే.

అందుకే .. జగన్ అభిమాని జనం మెచ్చిన నేత

ఆ నేతే ... ! **శ్రీ రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.**

ప్రతాప్‌కుమార్‌రెడ్డి కి ఓటువేసి రాజన్న ఆత్మకు శాంతి కలిగించండి.

ఈ రాష్ట్రాన్ని అభివృద్ధి దిశగా కదిలించే ప్రయత్నానికి స్వీకారం చుట్టండి.

అందరూ కలిసి రండి.. కదలి రండి.. ప్రతాప్‌కుమార్‌రెడ్డి గెలుపులో భాగస్వాములు కండి..

ఇట్లు :

**డాక్టర్ వై.యస్. రాజశేఖర్‌రెడ్డి గారి అభిమానులు,**
**జగన్ హితులు.**

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.